# ఈజిప్టు







"స్వేచ్ఛా స్వాతంత్ర్యాధికారాలకు అర్థం మాకు తెలుసు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాధికారాలను మేము అమలుపరచి తీరుతాం."

"ఈనాడు ఈజిప్ట్ ప్రజలధ్యేయం ఒకటే. హృదయంఒకటే. ఆశాలక్ష్యాలూ ఒకటే."

— నాజర్.

# ఈజిప్టు



రచన:

కంభంపాటి సత్యనారాయణ

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2.

# 1

# ఈజిప్ట్

ఈజిప్ట్ ఆఫ్రికాఖండంలో ఈశాన్య దిశగా 38,600 చదరపు మైళ్ళ విస్తీర్ణంగల దేశం. దీనికి ఉత్తరాన మధ్యధరా సముద్రం, తూర్పున ఎర్రసముద్రం ఉన్నాయి. ఆసియా - ఆఫ్రికా ఖండాలను కలుపుతున్న సూయజ్ భూ సంధి ఈజిప్ట్‌లోనిదే. దీని జనాభా 2,20,00,000. మొత్తం వైశాల్యంలో 100 కి 97 వంతులు సహారా ఎడారి. పంట భూములన్నీ నైలునదికి ఇటూ అటూ మాత్రమే ఉన్నాయి. జనాభా అంతా నైలు నదిలోయ, డెల్టా ప్రాంతంలోనే నివసిస్తున్నారు. ఈ ప్రాంతానికి 'దిగువ ఈజిప్ట్' అని పేరు. ఇక్కడ జనసాంద్రత చాల హెచ్చు. ఒక్కొక్క చదరపు కిలోమీటరుకు దాదాపు 600 మంది చొప్పున (1 కిలో మీటరు 5 ఫర్లాంగులతో సమానం) నివసిస్తున్నారు.

4000 మైళ్ళ పొడవుగల నైలునది, ఆఫ్రికా అంతర్భాగంలో రెండు పెద్ద సరస్సులలో పుట్టి సుడాన్, ఈజిప్ట్‌లగుండా ప్రవహించి, మధ్యధరాసముద్రంలో కలుస్తూంది. సాధారణంగా మే మాసంలో యీనదిలో నీరు బహు తక్కువగా ఉంటుంది. అందుచేత భూమి నెర్రలువారి ఉంటుంది. కాని జూన్ మాసంలో కురిసే వర్షాలవల్ల దాని ఉపనదులన్నీ నీటితోనిండి, ఆ నీరు మహా వెల్లువగా ప్రవహించి నది అంతా పొంగుతుంది. మొదట ఆకుపచ్చనీరు వస్తుంది. తర్వాత, నెలరోజులకు విస్తారమైన ఖనిజాలతోను, పొటాష్ పదార్థంతోను నిండిన ఎర్రనీరు వస్తుంది. అది అక్టోబరు వరకు ప్రవహించి, తర్వాత తగ్గుముఖం పడుతుంది. బ్రహ్మాండమైన యీ ప్రవాహంలో చక్కని ఒండ్రుమట్టి అబిసీనియన్ పీఠభూములనుంచి కొట్టుకొనివస్తుంది. అది నైలునది కిరుపైపులా చేరి నేలను సారవంతమొనరుస్తుంది. అందుచేత యీ ప్రాంతంలో ఏడాదికి రెండు, మూడు పంటలు పండడాని కవకాశంఉంది. అక్టోబరు తర్వాత ఈ నీరు కాలువలలో నిల్వఉంటుంది.

అబిసీనియా పీఠభూములనుంచి కొట్టుకొనివచ్చే యీ ఒండ్రుమన్ను నల్లనిది కనుక, ఆ ప్రాంతాన్ని పూర్వం ఈజిప్షియన్లు "నల్లదేశము"ని పిలిచేవారు. అది లేని ప్రాంతం ఎర్రటి ఇసుకతో కప్పబడి యుంటుంది గనుక, "ఎర్రదేశము"ని

(సేత్) ఎడారి రూపం ధరించినట్లు భావించేవారు. 2000 సంవత్సరాలనాడు హెరొడోటస్ అను గ్రీకు చరిత్రకారుడు "ఈజిప్ట్‌దేశం నైలు నదియొక్క వరప్రసాదమ"ని వర్ణించాడు. కాని యిది అర్థసత్యం మాత్రమే. సహారా ఎడారిని పంటభూమిగా మార్చేందుకు ఈజిప్ట్ ప్రజలు వేలకొద్దీ సంవత్సరాలు పాటుపడ్డారు. ఈ కృషిలో గొప్ప అనుభవం సంపాదించారు. ప్రతి అంగుళం భూమిని సారవంత మొనర్చేందుకు వారు పడరాని పాటు పడ్డారు. నదిలో తగినంత నీరు ప్రవహించకపోతే పంటలన్నీ ఎండిపోయి కరువు వస్తుంది. మరీ యెక్కువ నీరు వస్తే గట్లు, కట్టలు తెగి పంటలకు అపారనష్టం వాటిల్లుతుంది.

ఈజిప్ట్‌దేశ పండుగల్లో నైలునది పండుగ ప్రధానమైనది. ప్రతిసంవత్సరం ప్రజలు జనవరి 10 వ తేదీన ఈ పండుగ చేసుకుంటారు. నైలునదిమీద పడవల్లో షికారుకు వెళ్తారు. పడవల్లోనే పాటలుపాడి నృత్యం చేస్తారు. ఫలహారాలు కూడా పడవల్లోనే చేస్తారు. ఆ తర్వాత నదిలో స్నానాలు చేస్తారు.

ఈజిప్ట్ ఎంతో ప్రాచీన నాగరికతగల దేశాల్లో ఒకటి. క్రీ. పూ. 7000 ప్రాంతంలో అక్కడ పెద్ద పెద్ద నగరాలు, కట్టడాలు, ఇరిగేషన్ వసతులు ఉండేవనడానికెన్నో ఆధారాలున్నాయి. వెండి, బంగారం, రాగి, కంచు లోహాల పనిముట్లు, ఆభరణాలు ఆ రోజుల్లో ఉపయోగంలో ఉండేవి. ప్రజల్లో అధిక సంఖ్యాకులు వ్యవసాయంలో నిమగ్నులయేవారు. వర్తకం వస్తుమార్పిడి పద్ధతిద్వారా జరిగేది. రాజు ఈశ్వరాంశ సంభూతుడని ప్రజలు విశ్వసించేవారు. అతన్ని "ఫెరోవా" అని పిలిచేవారు. రాజవంశీకులు, బానిస యజమానులు లక్షలాది బానిసల్ని అమానుషంగా, పైశాచిక పద్ధతుల్లో పీడించుకు తినేవారు. చక్రవర్తి చనిపోయిన తర్వాతకూడా, అతని అధికారం చెక్కుచెదరదని భావింపబడేది; అతని ఆత్మ శాశ్వతంగా ఉంటుందనే నమ్మకంతో రాజభవనం వంటి పెద్ద భవనాల్ని నిర్మించి, వాటిలో చక్రవర్తుల్ని ధన, కనక, వస్తు, వాహనాలతో సమాధిచేసేవారు. ఆ సమాధులమీద పెద్ద పెద్ద రాళ్ళతో ఎత్తయిన కట్టడాలను నిర్మించేవారు. ఇదే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన పిరమిడ్లు. వాటిని నిర్మించడానికి లక్షలాది బానిసలు నియోగింపబడేవారు. పెద్ద పెద్ద రాళ్ళను నైలునది మీదుగా పడవల్లో చేర్చితే, వాటిని బానిసలు పుల్లీల, ఏటవాలుగోడల సహాయంతో ఒక దానిమీద ఒకటి పేర్చేవారు. ఇట్టి పిరమిడ్లను మనం యీనాటికీ చూడవచ్చు. ఉదాహరణకు, గ్రేట్ పిరమిడ్ అను కట్టడం ఎంత బ్రహ్మాండమైనదంటే, దాని అడుగుభాగం 227 మీటర్లు (ఒక మీటరు సుమారు ఒక గజంతో సమానం), ఎత్తు 137 మీటర్లుఉంది. ఈ రోజున దాని నిర్మాణాని కవసరమైన రాళ్లను ఆ స్థలానికి చేర్చాలంటే ముప్పయ్యేసి వాగన్లుగల 20,000 రైళ్లు అవసరమవుతాయని ఒక చెకొస్లొవేకియన్ శాస్త్రజ్ఞుడు అంచనా వేశాడు.

ఈజిప్ట్ ప్రాచీన చరిత్ర కొన్ని శకాలుగా విభజింపబడింది. క్రీ. పూ. 3300 - 2778 మధ్యకాలం తీనైట్ శకం. ఈ కాలంలో రాజ్యమేలిన చక్రవర్తులంతా భూమిని సారవంతమొనర్చేందుకు నైలునదికి కాలువలు త్రవ్వించడంలోను, లిబియా మొదలైన పొరుగు రాజ్యాలమీద దండయాత్రలు చేయడంలోను నిమగ్నులయారు. క్రీ. పూ. 2778-2065 మధ్యకాలం పురాతనశకం. ఈకాలంలో పరిపాలన చేసిన ఫెరోవాలు బ్రహ్మాండమైన కోటలు, దేవాలయాలు, పిరమిడ్లు నిర్మించడమేగాక దీర్ఘకాలం యుద్ధాలుచేశారు. చివరి 3 రాజవంశాలకాలంలో (క్రీ. పూ. 2300-2065) అసంఖ్యాకులైన బానిసలు బానిసయజమానుల మీద తిరుగుబాట్లు చేశారు. రాజభవనాలను, దేవాలయాలను ధ్వంసమొనర్చి ప్రజాపీడకులమీద కసితీర్చుకున్నారు. చక్రవర్తిని అపహరించి వధించారు. సంపన్న కుటుంబాల స్త్రీలు తినడానికి తిండిలేక ఆక్రందనాలు చేశారట. డబ్బుకోసం వారు తమ కూతుళ్లను పడుపు వృత్తిలో ప్రవేశపెట్టారట.

క్రీ. పూ. 2065 - 1580 మధ్యకాలంలో (మధ్యశకం) రాజ్యమేలిన చక్రవర్తులు బానిసవిధానాన్ని సంస్కరించడానికి కొన్ని చర్యలు తీసుకుని శాంతిస్థాపనకు పూనుకున్నారు. నీటి పారుదల వసతులు కల్పించారు. న్యాయశాస్త్రాన్ని తగువిధంగా మార్చారు.

క్రీ. పూ. 1730 - 1580 మధ్య ఆర్యజాతికి చెందిన విదేశరాజులు ఈజిప్ట్ మీద దండయాత్ర చేశారు. ఈజిప్ట్ చక్రవర్తులు వారితో ఎడతెగని యుద్ధాలు జరిపి, చివరకు వారిని తరిమివేశారు.

క్రీ. పూ. 1580 - 1085 మధ్యకాలం నూతనశకం. ఈ కాలంలో ఈజిప్ట్ చక్రవర్తులు అనేక పొరుగుదేశాలను ఓడించి బ్రహ్మాండమైన సామ్రాజ్యాన్ని స్థాపించారు.

క్రీ. పూ. 1085 - 332 మధ్యకాలం చివరిశకం. ఈ శకంలో అనేక యుద్ధాలు, దండయాత్రలు జరిగాయి. రాజులు, రాజవంశాలు మారాయి. కాని సామాజిక వ్యవస్థలో మాత్రం ప్రధానమైన మార్పులేవిలేవు.

క్రీ. పూ. 525 లో పెర్ష్యారాజులు ఈజిప్ట్‌మీద దండెత్తి వశపరచుకున్నారు.

క్రీ. పూ. 332 లో గ్రీక్ చక్రవర్తి అలెగ్జాండరు ఈజిప్ట్‌ను జయించాడు. అప్పటినుంచి క్రీ. పూ. 30 వరకు గ్రీక్ రాజులే ఈజిప్ట్‌ను పరిపాలించారు. క్రీ. పూ. 30 నుంచి క్రీ. శ. 640 వరకు రోమన్ సామ్రాట్టులు ఈజిప్ట్‌ను పరిపాలించారు. క్రీ. శ. 640 లో అరబ్బులు దండెత్తివచ్చి 1517 వరకు రాజ్యమేలారు. 1517 నుంచి 19వ శతాబ్దంవరకు ఈజిప్ట్ టర్కీసామ్రాజ్యంలో భాగంగావుండేది. 19 శతాబ్దపు పూర్వార్థ భాగంలో ఈజిప్ట్ గవర్నరు మహమ్మదాలీ స్వపరిపాలన

ప్రకటించుకొన్నాడు. అతడే ఆధునిక ఈజిప్టుకు పునాదిరాయివేశాడు. 1882లో బ్రిటిష్‌వారు ఈజిప్ట్‌ను స్వాధీన పరచుకున్నారు. అప్పటినుంచి 1952 వరకు అది బ్రిటిష్ పాలనక్రింద ఉంది.

ఇప్పటికి 4000 సంవత్సరాల క్రిందట - అనగా క్రీ. పూ. 2000 ప్రాంతంలో—ఒక ఈజిప్ట్ ఫెరోవా నైలునదినీ, ఎర్రసముద్రాన్నీ కలిపే ఒక పడవల కాలువను నిర్మించినట్లు చరిత్రకారులు తెలియజేశారు. ఈ కాలువనే 1000 సంవత్సరాల తర్వాత మరొక చక్రవర్తి వెడల్పు చేయించి, ఓడలు ప్రయాణం చేయడాని కనువుగా దాన్ని తవ్వించాడు. ఆ ఓడల్లోనే విదేశాలతో వర్తకం జరిగేది. ఆ కాలువ "ఫెరోవాల కాలువ" అని పిలువబడేది. క్రీ. పూ. 6 వ శతాబ్దంలో నెకో అను పేరుగల మరో చక్రవర్తి యీ కాలువనే తిరిగి తవ్వించడం ప్రారంభించాడట. దాదాపు 1,20,000 మంది బానిసలు కాలువ త్రవ్వకంలో నియోగింపబడ్డారట. కాని "దేవదూత" ఆదేశంవల్ల ఆపని మధ్యలో ఆగిపోయిందట. ఇంత పెద్ద కాలువను నిర్మిస్తే విదేశాలనుంచి శత్రువులువచ్చి దాడిచేస్తారని ఆ "దేవదూత" చెప్పిందని పురాణాల్లో వ్రాయబడింది. తర్వాత పెర్షియన్ రాజులు ఆ కాలువను తిరిగి తవ్వించారు. రోమన్ చక్రవర్తులు ఈజిప్ట్‌ను స్వాధీన పరచుకున్న తర్వాత దాన్ని మరింత అభివృద్ధిపరచారు. కాని అరబ్బురాజుల కాలంలో దాని ప్రాముఖ్యత తగ్గిపోయింది. కారణమేమంటే 13,14 శతాబ్దాలలో ఇండియా, చైనా దేశాలకు ఒక పెద్ద భూమార్గం ఉత్తర దిశగా నిర్మింపబడింది. తర్వాత పోర్చుగీసువారు ఆఫ్రికా ఖండంచుట్టి ఇండియాకు వచ్చే సముద్రమార్గాన్ని కనుగొన్నారు.

# 2

## సూయజ్‌కాలువ నిర్మాణం : సామ్రాజ్యవాదుల దోపిడీ

19వ శతాబ్ది ప్రారంభంలోనే విదేశ సామ్రాజ్యవాదులు ఈజిప్టును స్వాధీనపరచుకోవాలనుకున్నారు. అంతకుముందు ఫ్రెంచి, పోర్చుగీసు, బ్రిటిష్ వర్తకులు ఇండియా, ఇండొనేషియా, బర్మా, చైనా మొదలైన దేశాలతో వర్తకం చేయాలంటే, ఆఫ్రికా ఖండాన్ని చుట్టి రావలసి వచ్చేది. ఇందుకు 3 నెలలు పట్టేది. ఈజిప్టును వశపరచుకొని సూయజ్ కాలువను త్రవ్విస్తే యీ బాధ తప్పుతుందని వారు గ్రహించారు. సూయజ్ కాలువ మధ్యధరా సముద్రాన్ని ఎర్రసముద్రంతో కలుపుతుంది. తత్ఫలితంగా, 3 నెలల్లో ప్రయాణం చేయవలసిన ఓడలు 14 రోజుల్లో బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన దేశాలను చేరుకోగల్గుతాయి. ఆసియా ఖండంలో వివిధ దేశాలనుంచి పత్తి మొదలైన ముడి పదార్థాలను శీఘ్రకాలంలో తమ దేశాలకు తరలించుకు పోవచ్చు. తమ దేశాల్లో తయారైన బట్టలు మొదలైన పారిశ్రామిక వస్తువులను త్వర త్వరగా ఆ దేశాలకు చేరవేయవచ్చు. ఆసియా ఖండంలోని దూరప్రాచ్య దేశాలతో వ్యాపారం చేయడాని కుపయోగపడే ఈ ఏకైక సముద్రమార్గం పూర్తిగా తమ స్వాధీనంలో ఉంటుంది. అంతేకాదు; లాంకషైర్ జౌళి మిల్లు యజమానులు నైలునది లోయలో విస్తారంగా పండే పత్తిని కారుచౌకగా తమ దేశానికి తరలించుకు పోదలచారు. ఇందుకు ఈజిప్టును తమ వలసదేశంగా చేసుకోదలచారు. ఫ్రెంచి పాలకుల దృష్టికూడా ఈజిప్టుమీద పడింది.

టర్కీ సామ్రాజ్యంక్రింద ఈజిప్టును పరిపాలించే రాజు సయ్యద్ పాషా (1854 - 63) తన దేశంలో రైలుమార్గ మొకటి వేయాలనే సంకల్పంతో ఫ్రెంచి బ్యాంకర్లవద్ద ఋణంచేశాడు. ఫ్రెంచి ఇంజనీరు లెస్సెప్స్ సయ్యద్ పాషాతో స్నేహంచేసి, సూయజ్ కాలువను త్రవ్వించమని సలహా యిచ్చాడు. ఈ కాలువ గుండా రాకపోకలు సాగించే ప్రయాణీకులవల్ల, సరకులవల్ల బోలెడు ధనం సంపాదించవచ్చునని అతడు సూచించాడు. ఇందుకుసయ్యద్‌పాషా అంగీకరించి 1856లో సూయజ్ కాలువ కంపెనీని స్థాపించడానికి ఉత్తరువులు జారీచేశాడు. దానిపై పూర్తి యాజమాన్యం ఈజిప్ట్ ప్రభుత్వాని కుంటుంది. ఒడంబడిక పత్రంలో "ఈజిప్ట్ ప్రభుత్వం నష్టపరిహారం చెల్లించినట్లయితే సూయజ్ కాలువపై తిరిగి యాజమాన్యం పొందవచ్చు"నని స్పష్టంగా, ఎట్టి అనుమానాలకు తావులేకుండా వ్రాయబడింది.

కంపెనీ షేర్లలో 100 కి 44 వంతులు ఈజిప్టువి; మిగతావి ఫ్రెంచి, టర్కీ ప్రభుత్వాలవి. ఆనాడు ఈజిప్టుపై టర్కీకి సార్వభౌమాధికార ముండేది. అందుచేత టర్కీకికూడా కొన్ని షేర్లను యివ్వవలసి వచ్చింది. సయ్యద్ పాషా ఆ కాలువను, కాలువప్రక్క పెట్రోలుగనులుండే ప్రదేశాన్ని 99 సంవత్సరాల వరకు కంపెనీకి కౌలుకిచ్చాడు. కంపెనీ పెట్టుబడికై సయ్యద్ పాషా బ్రిటిష్ బ్యాంకర్లను 33 లక్షల పౌనులు అప్పుయిమ్మని కోరాడు. వారు 24 లక్షలేయిచ్చి, 33 లక్షల పౌన్లకు ప్రామిసరీనోటువ్రాయించుకున్నారు. వడ్డీరేటు 100కి 7 పౌనులు. ఈ 24 లక్షల పౌనులుకాక, మరికొంత ధనాన్ని ఫ్రెంచి పెట్టుబడిదార్లవద్ద అప్పుగా తీసుకొచ్చి, మొత్తం 80 లక్షల పౌనుల పెట్టుబడితో సయ్యద్ పాషా సూయజ్ కంపెనీని స్థాపించాడు. కంపెనీ సంపాదించే లాభాల్లో 100 కి 75 వంతులు వివిధభాగస్తులకు, 10 వంతులు ఫ్రెంచి ఇంజనీరుకు, తక్కిన 15 వంతులు ఈజిప్టు ప్రభుత్వానికి చెందాలని ఎగ్రిమెంటు వ్రాసుకున్నారు.

మొదట్లో బ్రిటిష్ ప్రభుత్వం యీ కాల్వను త్రవ్వించడానికి అభ్యంతరం తెలిపింది. ఈజిప్టులో ఫ్రెంచివారి పలుకుబడి విస్తరించడం వారి కిష్టంలేదు. అందుచేత వారు కంపెనీ స్థాపన ఆలస్యంగా జరిగేటట్లు చేయడానికి ప్రయత్నించారు. కాని సయ్యద్ పాషా ఈజిప్టులో ఒక బ్రిటిష్ బ్యాంకును స్థాపించుకోడానికి అనుమతించడంవల్ల, 1857 లో మొట్టమొదటి భారత స్వాతంత్ర్య సమరాన్ని అణచేందుకు సూయజ్ భూసంధిగుండా బ్రిటిష్ సేనలను వెళ్ళనివ్వడంవల్ల బ్రిటిష్‌వారు తమ అభ్యంతరాన్ని ఒదులుకున్నారు.

ఆనాడు సూయజ్ కాలువ నిర్మాణంలో ఒక ఉద్యోగిగావున్న జార్జి బాల్డ్విన్ తన ప్రభుత్వాన్ని తీవ్రంగా హెచ్చరిస్తూ జాబు వ్రాశాడు. ఫ్రాన్స్ ఈజిప్టును వశపరచుకొంటే "ప్రపంచంలోని వర్తకకేంద్రాల జీవనాడి ఫ్రాన్స్ వశమవుతుంద"ని అతడు బ్రిటిష్ ప్రభుత్వానికి స్పష్టంచేశాడు.

కాలువ త్రవ్వకం 1859 ఏప్రిల్‌లో ప్రారంభమైంది. కాని సయ్యద్ పాషా కంపెనీ తాలూకు ధనాన్ని దుర్వ్యయం చేయడంవల్ల విదేశీ బ్యాంకర్లకతడు 1 కోటి పౌనులు బాకీ పడ్డాడు. అతని మరణానంతరం అతనికొడుకు ఇస్మాయిల్ పాషా రాజ్యానికి వచ్చాడు. అతడు గనులు త్రవ్వుకొనే హక్కును కంపెనీనుండి లాక్కొని, అందుకు ప్రతిఫలంగా కొంత నష్టపరిహార మిచ్చాడు. మొత్తంమీద 1869 నాటికి సూయజ్ కాలువ పనిపూర్తిఅయింది. 1869 నవంబరు 17 వ తేదీని గొప్ప ఉత్సవాలతో కాలువ ప్రారంభోత్సవం జరిగింది. దాని పొడవు 101మైళ్లు. ఇస్మాయిల్ పాషా దుర్వ్యసనాలలోపడి, పశ్చిమ రాజ్యాలనుంచి విపరీతమైన ధనం తెచ్చి అప్పుల పాలయ్యాడు. బ్రిటిష్, ఫ్రెంచి బ్యాంకులలో 7 కోట్ల 70 లక్షల పౌనులకు నోట్లు వ్రాసి, 5 కోట్ల పౌనులు మాత్రమే రొక్కంగా

అప్పు తెచ్చాడు. గైర్స, ఓడలు వేసుకొనే హార్బరును కూడా అతడు విదేశీ పెట్టుబడిదార్లకిచ్చాడు. కాని, వారికి అసలుగాని, వడ్డీగాని చెల్లించ లేకపోయాడు. అందువల్ల 1875 లో ఇస్మాయిల్ పాషా సూయజ్ కాలువ కంపెనీలో తన ప్రభుత్వానికున్న వాటా సొమ్మును, లాభంలో తన ప్రభుత్వానికి రావలసిన 100 కి 15 వంతుల భాగాన్ని ఫ్రెంచి పెట్టుబడిదార్లకు అమ్మివేయడానికి నిశ్చయించుకున్నాడు. ఈ సంగతి తెలుసుకొని, బ్రిటిష్ ప్రధాని డిజ్రేలి ఈజిప్ట్ తాలూకు వాటాలను (మొత్తం వాటాలలో యివి 100 కి 44) లాభాన్ని 4 కోట్ల 7 లక్షల పౌనులకు అతిచౌకగా కొనివేశాడు.

ఈ విధంగా సూయజ్ కాలువ నిర్మాణం ప్రారంభమైన 6 సంవత్సరాల్లో బ్రిటన్ దాదాపు సగం షేర్లను చేజిక్కించుకోవడమే గాక, అన్ని ఎక్కువ షేర్లుగల దేశం మరొకటి లేకనిపించుకొంది. కంపెనీ పెట్టుబడిగా బ్రిటన్ చెల్లించిన ధనం కొద్ది సంవత్సరాల్లోనే లాభం రూపంలో వచ్చేసింది. 1920-30 మధ్యకాలానికి పెట్టుబడికన్న దాదాపు 8 రెట్లు లాభాలు సంపాదించగల్గింది.

బ్రిటిష్ ప్రధాని యీ విక్రయాన్ని అనుమతించమని పార్లమెంటును కోరగా, కొందరు సభ్యులందుకు ఆక్షేపణ తెలిపారు. కాని డిజ్రేలి, ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని రక్షించుకొనేందుకు సూయజ్ కాలువ ఎంతో అవసరమని వివరించినతర్వాత పార్లమెంటు ఏకగ్రీవంగా అతని చర్యను బలపరచింది. అప్పటినుంచీ సూయజ్ కాలువగుండా ప్రయాణంచేసే ఓడల్లో 100 కి 80 వంతులు బ్రిటిష్‌వారివేనని లెక్కలు తెలియజేస్తున్నాయి. బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగాలైన ఇండియా, బర్మా, మలయా, సింహళం, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ దేశాలకిదొక్కటే సముద్రమార్గం.

ఈ కంపెనీ నిర్వహణకు మొత్తం 32 డైరెక్టర్లు నియమింపబడ్డారు. వీరిలో యిప్పుడు బ్రిటిష్ డైరెక్టర్లు 10 మంది, ఫ్రెంచి డైరెక్టర్లు 16 గురు, ఈజిప్షియన్లు 4 గురు, అమెరికన్ ఒకడు, డచ్చి ప్రతినిధి ఒకడు ఉన్నారు.

ఇస్మాయిల్ పాషా విదేశాల్లో చేసిన అప్పులు, వడ్డీలు తీర్చజాలనందున బ్రిటన్, ఫ్రాన్స్ మొదలైన ప్రభుత్వాలు ఈజిప్ట్‌పై ఆర్థిక పెత్తనం చెలాయించడానికొక కమిటీని నియమించాయి. వారు ఈజిప్ట్‌లో సగం పన్నులు వసూలు చేసుకోడానికి అధికారం పొందారు. ఇస్మాయిల్ పాషా యిందు కంగీకరించాడు. కాని కొంతకాలమయాక అతడు ఎదురుతిరిగేసరికి, బ్రిటిష్-ఫ్రెంచి ప్రభుత్వాలు అతన్ని సింహాసన భ్రష్టునిచేసి, అతని కొడుకును పాషాగా చేశారు. 1879 మొదలు 1882 వరకు అతనిపేరుతో ఆంగ్లో - ఫ్రెంచి పాలన కొనసాగింది. ఈ కాలంలో వారు ఈజిప్ట్ దేశ సంపదను నిశ్శృంఖలంగా కొల్లగొట్టుకున్నారు. ఆ దేశంలో పుష్కలంగా పండేపంటను కాజేయడానికి బ్రిటిష్ పెట్టుబడిదార్లు

ఎన్ని చేయాలో అన్నీ చేశారు. ఏడాదికి మూడు పంటలుపండే భూమిలో ఆహార ధాన్యాలకు బదులు పత్తిమాత్రమే పండింపజేశారు. ప్రజల అవసరాలతో నిమిత్తంలేకుండా, దేశ ఆర్థికవ్యవస్థను తమ స్వార్థానికి వినియోగించుకున్నారు. సారవంతమైన లక్షలాది యకరాలభూమి సారవిహీనమయింది. బ్రిటిష్ గుత్త వ్యాపారస్తులు పత్తివ్యాపారంవల్ల, నౌకావ్యాపారంవల్ల విపరీతమైన లాభాలు సంపాదించారు. రాజ్యాధికారం పేరుకుమాత్రమే పాషాది. నిజమైన అధికారం బ్రిటిష్ కాన్సల్ జనరల్‌ది.

ఈ విధంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఈజిప్ట్ ప్రజల్ని నిలువుదోపిడీ చేయడంలో ఫ్యూడల్ భూస్వాముల, వడ్డీ వ్యాపారుల, దళారీ వర్తకుల (విదేశ వ్యాపారంవల్ల కొంతలాభం సంపాదించేవర్గం) సహాయాన్ని పూర్తిగా పొందారు. వలసపాలనయొక్క వికృతరూపాలన్నీ ఈజిప్ట్‌లో తాండవించాయి.

ఈ దుష్ట విధానానికి వ్యతిరేకంగా ఈజిప్ట్ ప్రజలు 1882 లో తిరుగుబాటు చేశారు. తమ రాజు విదేశ పాలకులకు బానిసగా వ్యవహరించే పద్ధతిని వారు నిరసించారు. సూయజ్ కాలువకోసం అతడు తెచ్చిన అప్పులన్నింటినీ ఈజిప్ట్ ప్రభుత్వం చెల్లించి తీరుతుందనీ, రాజు తన సొంతఖర్చులకు తెచ్చిన అప్పును అతడే తన ఎస్టేట్లనమ్మి తీర్చుకోవాలనీ ప్రజలు డిమాండుచేశారు. అప్పుల కోసం విదేశ రాజ్యాలు తమ దేశాన్ని కొల్లగొట్టుకొనే పద్ధతిని సహించబోమని తెలియజేశారు. ఈ ఉద్యమానికి కర్నల్ అరబ్బీ పాషా నాయకత్వం వహించాడు. ఈజిప్ట్‌లో ఆంగ్లో - ఫ్రెంచి పాలకుల పెత్తనం అంతమవాలని అతడు ప్రచారం చేశాడు. వేలాది విద్యార్థులు, రైతులేగాక సైనికులుకూడా జాతీయ విముక్తి ఉద్యమాన్ని బలపరిచారు. ఈజిప్ట్ రాజు బ్రిటిష్ సలహాదార్ల ఆజ్ఞల ననుసరించి వేలాది జాతీయవాదుల్ని నైలు నదికి దక్షిణప్రాంతంలో ఉన్న అరణ్యాలకు ప్రవాసం పంపించాడు. అరబ్బీ పాషా మతోన్మాదుడని, సైన్యంలో తిరుగుబాటు రెచ్చగొడుతున్నాడని చెప్పి, బ్రిటిష్ పాలకులతన్ని అరెస్టుచేసి సింహళద్వీపానికి ప్రవాసం పంపారు. తమ భాగస్వాములైన ఫ్రెంచి పాలకులతో సంప్రతించకుండా ఈజిప్ట్‌లో సైన్యాలనుదింపి, ప్రత్యక్షపాలన మొదలుపెట్టారు. 1882 నుండి బ్రిటిష్‌వారే ఈజిప్ట్‌పై ఏకచ్ఛత్రాధిపత్యం వహించారు.

1888లో 9 రాజ్యాల ప్రతినిధులు టర్కీరాజధాని కాన్‌స్టాంటినోపుల్‌లో సమావేశమయారు (బ్రిటన్, జర్మనీ, ఆస్ట్రేలియా, హాలండ్, స్పెయిన్, ఫ్రాన్స్, ఇటలీ, నెదర్లాండ్స్, రష్యా, టర్కీ). వారుచేసుకున్న ఒడంబడిక, సూయజ్ కాలువలో అన్ని దేశాల ఓడలూ స్వేచ్ఛగా తిరుగవచ్చునని అంగీకరించింది. ఒడంబడిక పత్రంలోని 4 వ నిబంధన ప్రకారం, యుద్ధకాలంలోకూడా యీస్వేచ్ఛ అన్ని దేశాలకూఉంటుందనీ, యీ నిబంధనను అమలు జరపవలసింది ఈజిప్ట్ ప్రభుత్వమేననీ కూడా చెప్పబడింది. అయినప్పటికీ మొదటి ప్రపంచ సంగ్రామంలో

బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు తమ అడుగులకు మడుగులొత్తే ఈజిప్ట్ ప్రభుత్వం చేత యితరదేశాల ఓడలు సూయజ్ కాలువలో ప్రవేశించరాదని ఆంక్ష విధింప జేశారు. ఈ విధంగా, బ్రిటిష్ ప్రభుత్వం 1888 నాటి ఒడంబడిక షరతులను బాహాటంగా ఉల్లంఘించింది.

20 వ శతాబ్దం ప్రారంభంలో బ్రిటన్‌కి జర్మనీ పోటీరాజ్యంగా తయారైంది. యుద్ధంచేసి అయినా బ్రిటన్ యొక్క ప్రపంచాధిపత్యాన్ని దెబ్బకొట్టాలని జర్మనీ ఆలోచిస్తూంది. 1911 లో పాల్ రోహార్ బాక్ అను జర్మన్ రచయిత ఇలా వ్రాశాడు: "ఇంగ్లండ్ యొక్క భూతలసేనలపై దాడిచేసి గట్టి దెబ్బ తీయాలంటే- అది ఈజిప్ట్‌లోనే సాధ్యం". ఈజిప్ట్‌పై బ్రిటన్ ఆధిపత్యాన్ని కూలద్రోసే ఉద్దేశంతో కైజరు అటు బెర్లిన్‌నుంచి యిటు బాగ్దాద్‌వరకు ఒక పొడవైన రైలు మార్గం నిర్మించాలనుకున్నాడు. అలాచేస్తే పూర్వం వర్తక రహదారిగా ఉపయోగపడ్డ భూమార్గం తిన వశమవుతుందనీ, దానితో సూయజ్ కాలువ ప్రాముఖ్యత తగ్గిపోతుందనీ అతడు భావించాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో టర్కీ సుల్తాన్ కైజరు పక్షం వహించాడు. కాని జర్మనీ ఓడిపోవడంతో ఈజిప్ట్‌పై టర్కీ పెత్తనం సడలిపోయింది. యుద్ధానంతరం ఈజిప్ట్ ప్రజలు విదేశీయుల వలస దోపిడీనుంచి విముక్తి చెందడానికీ, జాతీయ స్వాతంత్ర్యం సంపాదించుకోడానికీ దృఢనిశ్చయులయారు. 1917 లో జరిగిన రష్యావిప్లవం యొక్క ప్రభావం ఈజిప్ట్ ప్రజలమీద కూడా పడింది. 1918 లో జగ్లుల్ పాషా నాయకత్వం క్రింద వాఫ్డ్ పార్టీ స్థాపింపబడింది. 1919 లో ఈజిప్ట్ ప్రజలు బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ఉద్యమం ప్రారంభించారు. దీన్ని అణచడానికి బ్రిటిష్ పాలకులు అతి క్రూరమైన నిర్బంధ విధానాన్ని ప్రవేశపెట్టారు. 1920 లో లార్డ్ కర్జన్ యిలా చెప్పాడు:

"ఒకసారి మనం భారతదేశంలో సామ్రాజ్యాన్ని స్థాపించుకున్నాక ప్రపంచ వ్యవహారాల్లో మన విధానమంతా దాన్ని శాశ్వతంగా కాపాడుకోడానికే ఉద్దేశింపబడాలి. భారతదేశంకొరకు కాకపోతే డిజ్రేలి ప్రభువు సూయజ్ కంపెనీ వాటాలను కొనియుండడు. సూయజ్ కాలువ కొరకు కాకపోతే మనం ఈజిప్ట్‌ను ఆక్రమించుకొనియుండం." దీన్నిబట్టి, బ్రిటిష్ పాలకులు తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకోడానికి, దాన్ని రక్షించుకోడానికి మాత్రమే ఈజిప్ట్‌ను తమ ఆధిపత్యంక్రిందికి తెచ్చుకున్నారని స్పష్టమవుతుంది. ఇండియాలోవలెనే ఈజిప్ట్‌లో కూడా వారొకవైపు స్వాతంత్ర్యోద్యమాన్ని అణచేటందుకు అతి పైశాచిక పద్ధతులవలంబిస్తూనే, స్వల్పమాత్రపు సంస్కరణలు కొన్నిటిని తెచ్చారు. ఉదాహరణకు ఈజిప్ట్‌కు ఒక కౌన్సిల్‌ను, ఒక అసెంబ్లీని ఏర్పాటుచేశారు. 1911 లో సూయజ్ కంపెనీ గడువును 99 సంవత్సరాలుగాక, మరో 40 సంవత్సరాలు

పాడిగించాలని ప్రభుత్వం చేసిన ప్రతిపాదనను అసెంబ్లీ ఏకగ్రీవంగా నిరాకరించింది.

బ్రిటిష్ వలసదోపిడీని తుదముట్టించేందుకు ఈజిప్ట్ ప్రజలు సాగించిన వీరోచిత పోరాటాల ఫలితంగా 1922లో బ్రిటిష్‌పాలకులు ఈజిప్ట్‌ను "స్వతంత్ర" దేశంగా ప్రకటించవలసివచ్చింది. అయితే, యిది నామమాత్రమైన స్వాతంత్ర్యం. నిజమైన అధికారం బ్రిటిష్‌వారిదే. ఉదాహరణకు, యీక్రింది శాఖలపై అధికారం ఈజిప్ట్ పార్లమెంటుకులేదు; బ్రిటిష్ ప్రభుత్వానికే సర్వాధికారం ఉంటుంది:

1. ఈజిప్ట్‌లోని సామ్రాజ్య రహదార్ల భద్రత
2. దేశ రక్షణ
3. విదేశీ ప్రయోజనాల రక్షణ
4. సుడాన్ పరిపాలన
5. విదేశాలతో ఈజిప్ట్ సంబంధాలు.

ఈజిప్ట్ 1 లక్ష మంది బ్రిటిష్‌సైనికుల ఆక్రమణక్రింద ఉంచబడింది. 1923లో ఈజిప్ట్‌ను చట్టబద్ధ రాచరికంగా ప్రకటించి అందు కనుగుణ్యంగా ఒక రాజ్యాంగ చట్టాన్ని తయారుచేశారు. వాఫ్డ్ పార్టీ నాయకత్వంక్రింద జాతీయ వాదులు ఈ రాజ్యాంగ చట్టాన్ని వ్యతిరేకించారు. పార్లమెంటుకున్న కొద్దిపాటి అధికారాలను రాజుఅపహరిస్తూ నిరంతరంగా ప్రవర్తిస్తున్నందుకూ, బ్రిటిష్‌వారు ఆర్థిక, రాజకీయ వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొంటూన్నందుకూ తీవ్రమైన అసంతృప్తి జ్వాలలు దేశమంతటా వ్యాపించాయి. ఈజిప్ట్‌నుంచి బ్రిటిష్ సేనలు వైదొలగాలనే నినాదం ప్రతిచోటా ప్రతిధ్వనించింది. 1935 లో ముస్సోలినీ అబిసీనియాపై దండయాత్రచేసి ఆ దేశాన్ని ఆక్రమించుకోవడంతో, ఈజిప్ట్ భవిష్యత్తును గురించి బ్రిటిష్ పాలకులు ఆందోళన చెందారు. 1936 లో ఆంగ్లో-ఈజిప్షియన్ సంధి జరిగింది. దాని ప్రకారం బ్రిటిష్‌వారు తమ సేనలను ఈజిప్ట్ భూభాగంనుంచి తరలించడానికి అంగీకరించారు. కాని సూయజ్ కాలువ ప్రాంతంలో బ్రిటిష్ సేనలుంటాయి. 20 సంవత్సరాలవరకు యీ హక్కు బ్రిటిష్ వారి కుంటుంది.

1936 వరకు - అంటే దాదాపు 70 సంవత్సరాలవరకు - ఈజిప్ట్‌కి ఒక్క దమ్మిడీకూడా రాయల్టీ రూపంలో సూయజ్ కంపెనీనుంచి ముట్టలేదు. 1937లో మాత్రమే ఏడాదికి 3 లక్షల పౌనులచొప్పున రాయల్టీ యివ్వడానికి కంపెనీ అంగీకరించింది. 1949 లో జరిగిన ఒప్పందం ప్రకారం, మొత్తం లాభాల్లో 100 కి 7 చొప్పున ఈజిప్ట్‌కి రాయల్టీ చెల్లించడానికంగీకరించింది.

రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఈజిప్ట్‌పై తమ బానిస సంకెళ్ళను మరింత గట్టిగా బిగించారు. బ్రిటిష్ ప్రధాని చర్చిల్ 1888

నాటి 9 రాజ్యాల ఒడంబడికకు భిన్నంగా, తన సైనికుల కొక ఉత్తర్వు జారీ చేస్తూ, అవసరమైతే సూయజ్ కాలువను పూర్తిగా ధ్వంస మొనర్చవలసిందని ఆజ్ఞాపించాడు. బ్రిటిష్‌వారు 1942 ఫిబ్రవరిలో తమ టాంకులతోను, మర ఫిరంగులతోను అకస్మాత్తుగా కైరోలోని రాజమందిరం ప్రవేశించి ఫరూక్ రాజుకి అంత్య సందేశ మొకటి యిచ్చారు. తమ విశ్వాస పాత్రుడైన నహాస్ పాషాను ప్రధానిగా చేయమనీ, లేకపోతే సింహాసనం విడిచి బ్రిటిష్ విమానంలో ఇంగ్లండుకు వెళ్ళిపొమ్మనీ ఆజ్ఞాపించారు. ఫరూక్‌రాజు నహాస్‌పాషాను ప్రధానిగాను, వాఫ్ట్‌పార్టీ నాయకునిగాను చేయడాని కంగీకరించాడు. ఈ చర్య ఈజిప్టు ప్రజల్లో తీవ్రమైన ఆగ్రహాన్ని కలిగించింది. తమ దేశవ్యవహారాల్లో బ్రిటిష్ వారింత ఘాతుకంగా జోక్యం చేసుకున్నందుకు వారు మండిపోయారు. ఆంగ్లో-ఈజిప్షియన్ సంధికి ముందు బ్రిటిష్ హైకమీషనరు చెలాయించే అధికారాలన్నిటినీ బ్రిటిష్ రాయబారి చెలాయించుతూన్నందుకు ఆగ్రహావేశులయారు.

యుద్ధానంతరం, ఆంగ్లో - ఈజిప్షియన్ సంధిని సవరించాలనీ, బ్రిటిష సేనలు ఈజిప్టునుంచి వైదొలగాలనీ యించుమించు అన్నిరాజకీయ పార్టీలూ డిమాండు చేశాయి. ఈ సమస్యపై దాదాపు 10 సంవత్సరాలవరకు బ్రిటిష్ - ఈజిప్టు ప్రభుత్వాలమధ్య సంప్రతింపులు జరగడం, యీ కోర్కెను బ్రిటన్ నిరాకరించడంవల్ల సంప్రతింపులు విఫలమవుతూ వచ్చాయి. రెండవ ప్రపంచ యుద్ధంలో విపరీతంగా బలపడ్డ అమెరికన్ సామ్రాజ్యవాదులు తమ స్వార్థ ప్రయోజనాలకొరకు యీ పరిస్థితిని ఉపయోగించుకొనజూచారు. ఈజిప్టుతోసహా మధ్యప్రాచ్యదేశాలన్నిటిలోను బ్రిటిష్ ప్రాబల్యాన్ని తుదముట్టించి, సోవియట్ వ్యతిరేక యుద్ధసన్నాహాలలో వాటిని తమ సాధనాలుగా ఉపయోగించుకోడమే అమెరికన్ పాలకుల ఉద్దేశం. ఈ ఉద్దేశంతోనే వారు ఈజిప్టు - బ్రిటన్‌ల మధ్య "శాంతిదూతల" వేషం ధరించారు. ఈ "మధ్యవర్తిత్వం" చాలవరకు బ్రిటిష్ ప్రభుత్వానికి చీకాకు కలిగించింది. కాని వారు చేసేదిలేక, అంగీకరిస్తూ వచ్చారు.

ఈజిప్టు ప్రజలు అమెరికన్ పాలకుల కపట నాటకాన్ని అర్థంచేసుకోలేనంత అమాయకులు కారు. బ్రిటిష్ పెత్తనంపోయి అమెరికా పెత్తనంవస్తే తమకు ఒరిగే దేమీలేదని వారెరుగుదురు. 1951లో సూయజ్ ప్రాంతంనుంచి బ్రిటిష సేనలను గెంటివేయాలనే నినాదంతో ప్రజలు బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిపారు. కార్మికులు, విద్యార్థులు అసంఖ్యాకంగా వీటిలో పాల్గొన్నారు. ఈ ఒత్తిడి ఫలితంగా 1951 అక్టోబరులో ఈజిప్టు పార్లమెంటు 1936 నాటి ఆంగ్లో - ఈజిప్షియన్ సంధిని రద్దుచేస్తూ తీర్మానించవలసివచ్చింది. బ్రిటిష సేనలను సూయజ్ ప్రాంతంనుంచి ఉపసంహరించుకోవాలని ఆ తీర్మానం బ్రిటిష్‌వారిని కోరింది.

కాని బ్రిటన్ దీన్ని ఖాతరుచేయలేదు. పైగా బ్రిటిష్ సైనికులచే ప్రజల మీద కాల్పులు కాల్పించింది. ఇట్టి పరిస్థితుల్లో ఈజిప్ట్ దేశభక్తులు సాయుధ పోరాటం ప్రారంభించవలసి వచ్చింది. కార్మికులు, విద్యార్థులు, మధ్యతరగతి యువకులు ప్రతిఘటనోద్యమంలో చేరారు. సూయజ్ ప్రాంతంలోని బ్రిటిష్ స్థావరాలమీద వారు దాడులుచేయడం ప్రారంభించారు. బ్రిటిష్ క్యాంపులలో పనిచేసే ఈజిప్షియన్ కార్మికులంతా సమ్మెచేశారు. ఈజిప్ట్ దేశచరిత్రలో కనీవినీ యెరుగని ఈ జాతీయోద్యమ వెల్లువ బ్రిటిష్ పాలనల్ని హడలెత్తించింది. కాని, ఈజిప్ట్‌పాలకుల చేతకానితనంవల్ల ఈ ఉద్యమం క్రూరంగా అణచివేయబడింది.

అయినప్పటికీ ఈజిప్ట్ ప్రజల స్వాతంత్ర్యకాంక్ష వివిధరూపాల్లో వ్యక్తమయింది. బ్రిటన్, అమెరికాలు టర్కీ, పాకిస్తాన్‌ల సహాయంతో మధ్యప్రాచ్య దేశాలను - ముఖ్యంగా ఈజిప్ట్‌ని-సైనికకూటములలో సమీకరించ డానికి చేసిన కుట్రలను వారు తీవ్రంగా వ్యతిరేకించారు.

1952 జూలైలో ఈ బ్రహ్మాండమైన జాతీయోద్యమ ప్రభావంవల్ల జనరల్ నజీబ్, కర్నల్ నాజర్‌లు సైనిక తిరుగుబాటుద్వారా ఫరూక్ రాజును సింహాసన భ్రష్టుని చేశారు. నామమాత్రంగావున్న పార్లమెంటును, పాలకవర్గ పార్టీని (వాఫ్డ్) రద్దుచేశారు. ఈజిప్ట్‌ను రిపబ్లిక్‌గా ప్రకటించారు. దానికి అధ్యక్షుడు జనరల్ నజీబ్; ప్రధాని కర్నల్‌నాజర్.

# 3

## స్వాతంత్ర్య పరిరక్షణకు నాజర్ ప్రభుత్వం తీసుకున్న చర్యలు

నాజర్ ప్రభుత్వం అధికారానికి వచ్చిన వెంటనే చేసిన పనుల్లో ఒకటి పాతరాజ్యాంగాన్ని రద్దు చేయడం. 1923 నాటి ఈజిప్ట్ రాజ్యాంగం బ్రిటిష్ వలస రాజ్యాధిపతుల, వారి కండగావున్న రాచరిక - భూస్వామ్య వర్గాల ప్రయోజనాలను రక్షించేదిగా ఉండేది. పాత రాజ్యాంగం ఈజిప్ట్‌ను "స్వతంత్ర రాజ్యంగా" గుర్తించినప్పటికీ, నిజానికి ఈజిప్ట్ అర్ధవలస దేశంగానే, ఆక్రమిత దేశంగానే ఉండిపోయింది. "ఈజిప్ట్‌లో విదేశీయుల హక్కులకు భంగం కలుగకుండా" జాగ్రత్త వహించాలని పాత రాజ్యాంగం స్పష్టంగా నిర్దేశించింది. ఈ షరతు యిలాగే ఉన్నంతకాలం ఈజిప్ట్ తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోడం కలలోనివార్త. "విదేశీయుల హక్కులకు భంగం కలుగకుండా" చూడ్డానికే 1 లక్ష మంది బ్రిటిష్ సైనికులు ఈజిప్ట్‌లో తిష్టవేశారు. 1952 లో రాచరిక ప్రభుత్వం కూలద్రోయబడ్డ తర్వాత విప్లవ సమితి 1923 నాటి రాజ్యాంగాన్ని రద్దుచేసి, తాత్కాలికమైన ఒక నూతన రాజ్యాంగాన్ని అమల్లో పెట్టింది. కర్నల్ నాజర్ తన ప్రభుత్వ మనుసరించ దలచుకున్న దేశీయ విధానాన్ని వివరిస్తూ ఈ క్రింది ప్రధానాంశాలను పేర్కొన్నాడు:

(1) ఈజిప్ట్‌లో సామ్రాజ్యవాదాన్ని, సామ్రాజ్యవాద ఏజంట్లను నిర్మూలించడం. (2) ఫ్యూడల్ భూస్వామ్యవిధానాన్ని రద్దుచేయడం. (3) రాజ్యాంగ యంత్రంలో పెట్టుబడుల ప్రాబల్యాన్ని తొలగించడం. (4) దేశరక్షణకు బలీయమైన సాయుధ దళాలను నిర్మించడం. (5) ప్రజలందరికీ సామాజిక న్యాయం కలుగజేయడం. (6) ప్రజాతంత్రపాలనను నెలకొల్పడం.

ఈ సంస్కరణలను అమలు జరపడానికి నాజర్ ప్రభుత్వం కొన్ని ఖచ్చితమైన చర్యలు తీసుకొంది.

వాటిలో ప్రధానమైనది భూసంస్కరణల అమలు; రాజవంశీకుల, వారి అనుయాయుల భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని, ఎస్టేట్లన్నిటినీ రద్దు చేసింది. 1952 సెప్టెంబరులో వ్యవసాయ సంస్కరణల చట్టాన్ని ప్రవేశపెట్టింది. దాని ప్రకారం 200 ఫెడాన్లకు మించిఉన్న (ఫెడాన్ ఒక యకరం కంటే కొద్దిగా హెచ్చు) భూమిని భూస్వాములనుంచి వశపరచుకొని, 5 ఫెడాన్లకన్న

తక్కువభూమిగల రైతాంగానికి నాయిదాల పద్ధతిపై విక్రయించ నారంభించింది. కౌలుదార్లు చెల్లించవలసిన కౌలురేట్లను తగ్గించింది. ఈ చట్టంయొక్క నిబంధనల నుంచి తప్పించుకోడానికి అనేకమంది భూస్వాములు తమ భూములను అమ్మివేసు కున్నారు. చట్టాన్ని అమలు జరపడంలో ప్రభుత్వం అనేక చిక్కుల నెదుర్కో వలసివచ్చింది. అయినప్పటికీ ఈజిప్ట్ పత్రికల్లో ప్రచురింపబడ్డ సమాచారాన్ని బట్టి చాల జిల్లాలలో భూస్వాముల అదనపుభూమిని ప్రభుత్వం స్వాధీన పరచు కొంటున్నట్లు తెలుస్తోంది. భూసంస్కరణల చట్టం తీవ్ర స్వభావం కలదికాదన్న మాట నిజమే అయినప్పటికీ, దానివల్ల ఫ్యూడల్ భూస్వాముల ఆర్థిక, రాజకీయ ప్రాబల్యం కొంతవరకు తగ్గిందనే విషయం మాత్రం వాస్తవం.

వ్యవసాయోత్పత్తిని వృద్ధిచేయడానికీ, కొత్త భూములను సాగులోకి తేచ్చేందుకూ నాజర్ ప్రభుత్వం ఒక ప్రణాళికను తయారుచేసింది. అస్వాన్ డామ్‌కు 4 మైళ్లు దక్షిణంగా ఒక పెద్ద ఆనకట్టను నిర్మించడానికి సంకల్పించుకొంది. దానివల్ల 20 లక్షల ఫెడాన్ల భూమి సాగుక్రిందికి వస్తుంది. వ్యవసాయోత్పత్తి 100 కి 50 వంతులు పెరుగుతుంది. ప్రభుత్వం తయారుచేసిన నాలుగేండ్ల ప్రణాళిక (1952 - '56) ప్రకారం ఎగువ ఈజిప్ట్‌లోను, దిగువ ఈజిప్ట్‌లోను 3 లక్షల ఫెడాన్లభూమి అదనంగా సాగులోకిరావాలి. 1955 లో పత్తిపంట 1954 లో కంటె 2,30,000 ఫెడాన్లలో అధికంగా పండించింది. ఒక్కొక్క ఫెడాన్‌లో ఎక్కువ పంట పండించడానికి, కొత్తరకాల పత్తిని కనిపెట్టడానికి వ్యవసాయ మంత్రిత్వశాఖ పరిశోధనలు జరిపిస్తోంది. చెరకు ఉత్పత్తిని పెంచడంలో గణనీయమైన అభివృద్ధి కనిపించింది.

రాజకీయస్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న ఈజిప్ట్ ఆర్థికంగాకూడ తన కాళ్ళమీద తాను నిలబడ్డానికి ప్రాతిపదికలను తయారు చేసుకొంటూంది. ప్రభుత్వం అనేక పారిశ్రామిక సంస్థల నిర్మాణానికి ప్లానులు తయారుచేయడమే కాక, కొన్నిటి నిర్మాణం ప్రారంభించింది. ఉదాహరణకు, కెయిరోవద్ద హెల్వాన్ అనే చోట ఒక ఉక్కు కర్మాగారాన్ని నిర్మిస్తోంది. అది పూర్తి అయితే ఏడాదికి 2,40,000 టన్నుల ఉక్కు తయారవుతుంది. కర్నల్ నాజర్ "భారీ పరిశ్రమల రంగంలో ఈజిప్ట్ ప్రవేశించిందనడానికి యీ కర్మాగార ముఖ తోరాణం" అని వర్ణించాడు. 1955 జూన్ 1 వ తేదీన కెయిరో సమీపంలో ఒక నూనె శుద్ధి కర్మాగారానికి శంకుస్థాపన జరిగింది. దీని నిర్మాణం పూర్తి అయితే, సూయజ్ కాలువగుండా పెద్ద పెద్ద గొట్టాలలో వచ్చే పెట్రోలు శుద్ధి చేయబడుతుంది. ప్రస్తుతం ఈ గొట్టాల నిర్మాణం పూర్తి కావస్తోంది. అలెగ్జాండ్రియాలో నిర్మింప బడుతున్న మరొక నూనె శుద్ధి కర్మాగారం రోజుకు 2100 టన్నుల పెట్రోలును శుద్ధి చేస్తుంది. సూయజ్ కాలువ వద్ద యిప్పుడున్న ప్రభుత్వ కర్మాగారంలో ఏటా ఉత్పత్తి అయ్యే 3 లక్షల టన్నుల నూనెను 13 లక్షల టన్నులకు హెచ్చించ

డానికి తీవ్ర కృషి జరుగుతోంది. అశ్వాన్‌డామ్‌వద్ద ఏడాదికి 1000 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే పవర్‌స్టేషను నిర్మాణానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ డామువద్దనే ఏడాదికి 200 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే మరొక పవర్‌స్టేషన్ ప్రభుత్వ దృష్టిలో వుంది. ఒక పెద్ద ఎరువుల ఫ్యాక్టరీ, ఒక పేపరుమిల్లు, ఒక పంచదార ఫ్యాక్టరీ, ఒక టైర్లఫ్యాక్టరీ, ఒక జూట్‌ మిల్లు మొదలైనవెన్నో ప్రభుత్వ ప్రణాళికలో వున్నాయి.

ఈజిప్ట్ ప్రజలు, ఈజిప్ట్ ప్రభుత్వం పశ్చిమ దేశాలతోనేకాక, యితర దేశాలతోకూడ (వాటి ఆర్థిక రాజకీయ వ్యవస్థ లెట్టిదైనా) అన్యోన్య సహాయ ప్రాతిపదికపై వర్తక సంబంధా లుంచుకోవాలని కోరుతున్నారు. పశ్చిమ రాజ్యాలరు తమ ముడి పదార్థాలను కారుచౌకగా అమ్ముకొని, వారు సప్లయిచేసే వస్తువులను అధిక ధరలకు కొనుక్కునేస్థితి పోవాలనీ, అన్ని దేశాలతో సమానప్రాతిపదికపై వ్యాపారం చేసుకోనేటట్టు ఉండాలనీ వారు భావిస్తున్నారు. తదనుగుణ్యమైన విధానాన్ని ప్రభుత్వం అవలంబిస్తోంది. సౌదీ అరేబియా, సిరియా, లెబనాన్ దేశాలతో ఈజిప్ట్ ఆర్థికసంబంధాలు యీమధ్య ఎంతో బాగుపడ్డాయి.

అన్యోన్య సహాయ ప్రాతిపదికపై అన్ని దేశాలతో వర్తక సంబంధాలను పెంపొందించుకోనగోరే సోషలిస్టు ప్రపంచంతో ఈజిప్ట్ అంతకంతకూ అధికంగా ఆర్థిక సంబంధాలను అభివృద్ధిచేసుకొంటూంది. ఉదాహరణకు ఈజిప్ట్ సోవియట్ యూనియన్‌కి పత్తిని విస్తారంగా ఎగుమతిచేసి, పెట్రోలు మొదలైన పదార్థాలను దిగుమతి చేసుకొంటూంది. ఈ మధ్య ఉభయ ప్రభుత్వాల మధ్య జరిగిన వర్తక ఒడంబడిక ప్రకారం రష్యా ఈజిప్ట్‌కి పారిశ్రామిక యంత్రాలు, వ్యవసాయ యంత్రాలు, ఇనుము - ఉక్కు సామగ్రి, కలప వగైరా అమ్ముతుంది. 1955 లో చైనా ప్రజా రిపబ్లిక్‌కీ ఈజిప్ట్‌కీ మధ్య మూడు సంవత్సరాలు అమల్లోవుండే వర్తక ఒడంబడిక జరిగింది. దాని ప్రకారం ఉభయదేశాలవారూ ఒకరి సరకుల నొకరు యిచ్చి పుచ్చుకునే పద్ధతిపై వ్యాపార సంబంధాలను పెంపొందించుకొంటున్నారు. 1955 లో ఈజిప్ట్ - జెకోస్లొవేకియాల మధ్య వర్తకం 100 కి 15 వంతులు పెరిగింది. ఈజిప్ట్ పత్తిని, బియ్యాన్ని జెకోస్లొవేకియా ధారాళంగా కొంటూంది. వాటికి ప్రత్యామ్నాయంగా ఇరిగేషన్ ప్రాజెక్టుల కవసరమైన యంత్రసామగ్రిని, పారిశ్రామిక యంత్రాలను, వైద్య పరికరాలు మొదలైన వాటిని పంపుతోంది. ఈజిప్ట్ ఆహ్వానంమీద హంగేరీనుంచి యీ మధ్యనే వచ్చిన పారిశ్రామిక నిపుణులు కొందరు ఈజిప్ట్‌లో పరిశ్రమల అభివృద్ధికిగల అవకాశాలను సమగ్రంగా పరిశీలించారు. ఆ దేశం నుంచి ఈజిప్ట్ యంత్రభాగాలను, విద్యుచ్ఛక్తి పరికరాలను, రసాయనాలు, మందులు మొదలైనవాటిని దిగుమతి చేసుకొంటూంది. పోలెండు, రుమేనియా, తూర్పుజర్మనీలకు ఈజిప్ట్ సప్లయిచేసే పత్తి, నూలు మొదలైన ముడిపదార్థాలకు బదులుగా ఆదేశాలు పెట్రోలు, రైల్వే

ఇంజన్లు, లారీలు, ఉక్కు రేకులు, రసాయనిక పదార్థాలు, యంత్రభాగాలు సప్లయి చేస్తున్నాయి.

ఈ విధంగా ఈజిప్ట్ సోషలిస్టు దేశాలతో వర్తక సంబంధాలను పెంపొందించుకొంటూ, ఆర్థిక పరాధీనతనుంచి, వలసవిధాన అవశేషాలనుంచి బయటపడ్డానికి తీవ్రమైన కృషి సల్పుతోంది. ఇందుకు రాజకీయ స్వాతంత్ర్యం ఒక బలమైన సాధనంగా ఉపయోగపడుతూంది.

సూయజ్ ప్రాంతంనుంచి బ్రిటిష్ సైనికులు ఉపసంహరింపబడాలనే ప్రజావాంఛకు అనుగుణ్యంగా, నాజర్ ప్రభుత్వం 1954 అక్టోబరులో బ్రిటన్ చేత ఒక ఒప్పందాని కంగీకరింపజేసింది. దాని ప్రకారం బ్రిటన్ 20 మాసాల్లో తన సేన లన్నిటినీ సూయజ్ ప్రాంతంనుంచి ఉపసంహరించుకోడాని కంగీకరించింది. ఈ 20 మాసాల గడువు 1956 జూన్ 18వ తేదీతో పూర్తిఅయింది. ఈజిప్ట్ భూభాగంమీద ఒక్క బ్రిటిష్ సైనికుడుకూడా యిప్పుడు లేడు. ఈజిప్ట్ దేశ చరిత్రలో యిదొక నూతన అధ్యాయమని చెప్పవచ్చు. ఏ లక్ష్యంకొరకు ఈజిప్ట్ప్రజలు 70 సంవత్సరాలు పోరుసల్పారో ఆ లక్ష్యం యీడేరింది. కర్నల్ నాజర్ ఈ సందర్భంలో యిలా తెలియజేశాడు: "ఇప్పుడు మనం పూర్తిగా స్వతంత్రులమయాం. మన విధానాలను మనం స్వేచ్ఛగా కొనసాగించుకోవచ్చు. జాతీయ ప్రయోజనాలను రక్షించుకోవచ్చు. ప్రస్తుతం ఈజిప్ట్ లక్ష్యం ఒక స్వతంత్ర జాతిగా, అభ్యుదయ శక్తిగా ముందుకు అడుగువేయడం".

ఈ మధ్య ప్రభుత్వం తయారుచేసిన నూతన రాజ్యాంగచట్టం, స్వతంత్ర ఈజిప్ట్యొక్క సర్వాం సహాధికారానికి మరో తార్కాణం. ఈజిప్ట్ తన స్వతంత్ర హోదాను పటిష్ట మొనర్చుకోడానికి సాగిస్తున్న కృషిలో అదొక ప్రధానఘట్టం. అది 1956 జూన్ 23 వ తేదీన జనవాక్య నిర్ణయంద్వారా యావన్మంది ప్రజల ఆమోదాన్ని పొందింది. అదే రోజున కర్నల్ నాజర్ ప్ర లందరిచే అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

ఈ నూతన రాజ్యాంగచట్టం ఈజిప్ట్ ప్రజల మనోవాంఛలను ప్రతిబింబిస్తోంది. సామ్రాజ్యవాదంగాని, వారి ఏజంట్లుగాని, ఫ్యూడల్ భూస్వామ్య విధానంగాని, గుత్తపెట్టుబడిదారుల ప్రాబల్యంగాని లేని సామాజిక వ్యవస్థను రూపొందించుకోడానికి ఈజిప్ట్ ప్రజలు కృతనిశ్చయులై యున్నారని దీని పీఠిక స్పష్టం చేసింది. ఈజిప్ట్ సర్వాం సహాధికారం గల స్వతంత్ర దేశమనీ, అరబ్బు జాతిలో అదొక భాగమనీ ప్రకటించింది. దాన్ని ప్రజాతంత్ర రిపబ్లిక్గా నిర్వచించింది.

నూతన రాజ్యాంగచట్టంలో యీ క్రింది ప్రధానాంశాలు పేర్కొనబడ్డాయి: ఈజిప్టు పౌరులంతా న్యాయశాస్త్ర దృష్టిలో సమానులు. వారు ఏజాతికి

చెందినా, ఏ భాష మాట్లాడేవారైనా, ఏ మతస్థులైనా వివక్షణ చూపబడదు. ఎన్నికల్లో పాల్గొనేహక్కు, వాక్సభా పత్రికా స్వాతంత్ర్యం గ్యారంటీ చేయ బడుతుంది. సాంఘిక న్యాయం, ప్రజాశ్రేయస్సు, ఉత్పత్తి పెరుగుదల లక్ష్యంగా ఉంచుకుని రచింపబడే ప్రణాళికల ప్రకారం సామాజిక వ్యవస్థ రూపొందింప బడుతుంది. ప్రభుత్వం సహకార సంస్థల నిర్మాణాన్ని ప్రోత్సహిస్తుంది. దేశం యొక్క మొత్తం ఆర్థిక కార్యకలాపాలనూ, ప్రైవేట్ సంస్థల చొరవనూ సమన్వయ పరుస్తుంది. సొంత ఆస్తులకు రక్షణ కల్పిస్తుంది. అదే సమయంలో భూమిపై యాజమాన్యాన్ని పరిమితి మొనర్చుతుంది.

ప్రజలకు తగినంత తిండి, గృహ వసతి, ఆరోగ్యం, విద్య కల్పించడం ద్వారా వారి జీవన ప్రమాణాన్ని పెంచుతుంది. మాతా శిశు సంరక్షణకు హామీ యిస్తుంది; స్త్రీల గృహకృత్యాలను, వారి సాంఘిక శ్రమను సమన్వయ మొనర్చ డంలో సహాయంచేస్తుంది. వయోవృద్ధులు ఎలవెన్సు పొందేహక్కును, వ్యాధిగ్రస్తు లైనపుడు ఆర్థికసహాయం పొందేహక్కును కాపాడుతుంది. సాంఘిక భీమా, సాంఘిక భద్రత, వైద్యసహాయం మొదలైనవి కల్పిస్తుంది. పన్నులు విధించడంలో సాంఘిక న్యాయాన్ని పాటిస్తుంది. ప్రభుత్వోద్యోగులు ప్రజాసేవకులుగా పని చేసేటట్లు చూస్తుంది. కార్మికుల ట్రేడ్ యూనియన్ హక్కులను కాపాడుతుంది. ఏదో ఒక వృత్తిలో అందరూ పనిచేసుకొనేహక్కును రక్షిస్తుంది. జీతాలు, పనిగంటలు మొదలైనవాటిని నిర్ణయిస్తుంది. ప్రభుత్వ పాఠశాలల్లో ప్రాథమిక విద్యను నిర్బంధంగాను, ఉచితంగాను నేర్పుతుంది.

శాసన నిర్మాణాధికారం నేషనల్ అసెంబ్లీకి ఉంటుంది. దాన్ని ప్రజలు 5 ఏండ్లకొకసారి ఎన్నుకుంటారు. అధ్యక్షుడు ప్రభుత్వాధిపతిగా వ్యవహ రిస్తాడు. అతన్ని కూడా ప్రజలే వయోజన ఓటింగు పద్ధతిపై 6 ఏండ్ల కొకసారి ఎన్నుకుంటారు. నేషనల్ అసెంబ్లీలో శాసనాలను ప్రతిపాదించే హక్కు, దాని నిర్ణయాలను వీటో చేసే హక్కు అతని కుంటుంది. నేషనల్ అసెంబ్లీ సమావేశాల మధ్య అసాధారణ ఉత్తరువులను జారీచేసే అధికారం కూడా అతని కుంటుంది. కొన్ని సమస్యలపై జనవాక్యం తెలుసుకోడానికి కూడా అతనికి హక్కు ఉంటుంది. అయితే అది నేషనల్ అసెంబ్లీ ఆమోదాన్ని పొందాలి. అధ్యక్షుడే సాయుధ బలాలన్నిటికీ సర్వసైన్యాధిపతి.

ఈ విధంగా, ఈజిప్ట్ దేశం అర్థవలస స్థితి నుంచి బయటపడి సంపూర్ణ స్వాతంత్ర్య మనుభవించే దేశంగా పరివర్తన చెందడానికి ఈ రాజ్యాంగ పత్రం దోహదమిస్తుంది.

విదేశాంగ విధానంలో కూడ ప్రభుత్వం తన ప్రజల మనోవాంఛల కను గుణ్యమైన మార్గ మవలంబిస్తోంది. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు

మధ్యప్రాచ్యంలో కొన్ని దేశాలను చీల్చి (పాకిస్తాన్, టర్కీ, ఇరాక్) వాటిని తమ సైనిక స్థావరాలుగా ఉపయోగించుకొనేందుకు చేసిన ప్రయత్నాలను ఈజిప్టు ప్రతిఘటించింది. టర్కీ, పాకిస్తాన్, ఇరాక్ ఒడంబడికను నిరసించింది. బాగ్దాద్ సైనిక కూటమిలో (బ్రిటన్, టర్కీ, పాకిస్తాన్, ఇరాక్, ఇరాన్) ఈజిప్టును యిరికించడానికి వారు చేసిన ప్రయత్నాన్ని భగ్నం చేసింది. ఇట్టి సైనికకూటాలు ప్రపంచ శాంతికి, ఆసియాదేశాల స్వాతంత్ర్యానికి ముప్పు తెస్తాయనీ, అరబ్బు దేశాల ఐక్యతను విచ్ఛిన్నం చేస్తాయనీ గుర్తించింది. కనుకనే బాండుంగ్ మహా సభలో ఈజిప్టు ప్రతినిధి కర్నల్ నాజర్ చిన్న దేశాలను తమ సాధనాలుగా ఉపయోగించుకొనజూచే సామ్రాజ్యవాదుల కుట్రలను నిశితంగా ఖండించాడు. వలస విధానాన్ని రూపుమాపాలని హెచ్చరించాడు. పెద్దరాజ్యాలు తమ సాయుధ బలాలను, మారణాయుధాలను తగ్గించుకోవా లన్నాడు; అణ్వాయుధాలను నిషేధించా లన్నాడు. ఇట్టి మార్గ మొక్కటే ప్రపంచ శాంతికి మార్గమని స్పష్టంచేశాడు.

1956 జూలై 20 వ తేదీన ఈజిప్టు అధ్యక్షుడు కర్నల్ నాజర్, యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో, భారత ప్రధాని నెహ్రూ కలిసి బ్రియోనీలో (యుగోస్లావియా) చేసిన సంయుక్త ప్రకటన అనేక అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి మార్గం చూపింది. మధ్యప్రాచ్యంలో శాంతిస్థాపన ఆ దేశాల్లో నివసించే ప్రజల స్వాతంత్ర్యాన్ని గుర్తించడం ద్వారానే సాధ్యమవుతుందని స్పష్టం చేసింది. ఫ్రెంచి వలస రాజ్యాధిపతులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఆల్జీరియా ప్రజల స్వాతంత్ర్య హక్కును గుర్తించాలని హెచ్చరించింది. దూరప్రాచ్య సమస్యల పరిష్కారానికి చైనా ప్రజా రిపబ్లిక్కును ఐక్యరాజ్య సమితిలో చేర్చుకోవాలని తెలియజేసింది. మధ్య యూరపులో ఉద్రిక్త పరిస్థితిని తొలగించాలంటే జర్మన్ ప్రజల అభీష్టాల కనుగుణ్యంగా యీ సమస్యను శాంతియుత సంప్రతింపుల ద్వారా పరిష్కరించాలని విశదపరచింది. బాండుంగ్ మహా సభ ఆమోదించిన దశ సూత్ర ప్రణాళికను బలపరచింది. అణ్వాయుధాల పాటవ పరీక్షలను ఆపుజేయాలని, ఆయుధ విసర్జనకు చర్యలు తీసుకోవాలని అగ్రరాజ్యాలను కోరింది. ఈ ప్రకటన ప్రపంచ శాంతికి, వివిధ దేశాల స్వాతంత్ర్యోద్యమాలకు ఎంతో దోహదమిచ్చింది.

ఈ నూతన విధానం సహజంగా సామ్రాజ్యవాదులకు కంటవెర్రులెత్తించింది. బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు ప్రభుత్వాలు కక్షతో ఈజిప్టుకు ఆయుధాల సప్లయిని ఆపివేశారు. వెంటనే నాజర్ ప్రభుత్వం జెకోస్లొవేకియా నుంచి 25 కోట్ల డాలర్ల విలువచేసే ఆయుధాలను తెప్పించుకోడానికి ఒప్పందం కుదుర్చుకుంది. దీనికి ప్రతి చర్యగా సామ్రాజ్యవాదులు ఈజిప్టు నుంచి పత్తిని కొనడానికి నిరాకరించారు. వెంటనే ఈజిప్టు చైనా ప్రజా రిపబ్లిక్ మొదలైన దేశాలతో

వర్తక ఒడంబడికలు చేసుకొని, ఆ దేశాలకు పత్తిని విస్తారంగా ఎగుమతి చేసింది. అమెరికా తన అనుగులకు మనుగులొత్తే ఇజ్రాయిల్‌ను పురికొల్పి, ఈజిప్టుతో సరిహద్దు ఘర్షణలను రెచ్చగొట్టింది. కాని ఈజిప్టు తన సరిహద్దులను ఎంతో సమర్థవంతంగా రక్షించుకొంది.

ఈ విధంగా తమ ఎత్తులన్నిటినీ భగ్నమొనర్చుతున్న ఈజిప్టుపై కసితీర్చుకోడానికి సామ్రాజ్యవాదులు చిట్టచివరి ఆయుధాన్ని ఈజిప్టుపై ప్రయోగించారు. అదే, అశ్వాన్ డామ్ నిర్మాణానికి ధన సహాయం నిరాకరించడం.

# 4

# సూయజ్ కాలువ జాతీయకరణ

నైలు నదిమీద ఈజిప్ట్ ప్రభుత్వం నిర్మించదలచుకున్న అశ్వాన్ డాము, ఆ దేశంయొక్క పునర్నిర్మాణ పథకాలన్నిటిలో బ్రహ్మాండమైనదని చెప్పవచ్చు. దానివల్ల 20 లక్షల యకరాల భూమి అదనంగా సాగులోకి వస్తుంది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి రెట్టింపు అవుతుంది. ఈ ప్రాజెక్టు ఈజిప్ట్ ప్రజల్లో గొప్ప ఉత్సాహాన్ని రేకెత్తించింది. అనేక సంవత్సరాలవరకు వేలాది కార్మికులకు ఉపాధి కలిగించడమే కాక, ఎంతోమంది పేద రైతులకది సాగు భూమిని ప్రసాదిస్తుంది. ఆహార ధాన్యాల ఉత్పత్తిని పెంచుతుంది. పరిశ్రమలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చేస్తుంది.

ఈ డాము నిర్మాణానికి 135 కోట్ల డాలర్లు అవసరమవుతాయని ఈజిప్ట్ ప్రభుత్వం అంచనా వేసింది. ఇందులో తాను 90 కోట్ల డాలర్లు యివ్వడాని కంగీకరించింది. అమెరికా 5 కోట్ల 60 లక్షల డాలర్లు, బ్రిటను 1 కోటి 40 లక్షలు - మొత్తం 7 కోట్ల డాలర్లు గ్రాంటుగా యివ్వడాని కంగీకరించాయి. అమెరికా ఆధిపత్యం క్రింద ఉన్న ప్రపంచబ్యాంకు 20 కోట్ల డాలర్లు అప్పుగా యివ్వడానికి వాగ్దానం చేసింది. మిగతా 21 కోట్ల డాలర్లు అమెరికా మొదలైన దేశాలనుంచి తర్వాత తీసుకోడానికి నిశ్చయమైంది. కాని ప్రపంచబ్యాంకు, బ్రిటన్-అమెరికా దేశాలు తాము చేసే ధనసహాయానికి అవమానకరమైన షరతులు విధించాయి. ఈజిప్ట్‌దేశ ఆర్థిక వ్యవస్థపై నిర్బంధాలు విధించి, సోషలిస్టు దేశాలతో ఈజిప్ట్‌కు గల వర్తక సంబంధాలను పరోక్షంగా నిరోధించడమే ఆదేశాల ఉద్దేశం. అందుచేత ప్రభుత్వం యీ షరతులను నిరాకరించింది. దీనితో అమెరికా ప్రభుత్వం అశ్వాన్ డామ్ నిర్మాణానికి ధనసహాయంచేయడానికి వీల్లేదని 1956 జూలై 19 వ తేదీన ప్రకటించింది. తర్వాత బ్రిటను, ప్రపంచ బ్యాంకు కూడా యిట్టి ప్రకటనలే చేశాయి. దీనితో ఈజిప్ట్ ప్రజలు కోపోద్రిక్తులయారు. తమ దేశాన్ని రాజకీయంగా ఒత్తిడిచేసి, సోషలిస్టు ప్రపంచంతో తాము స్నేహసంబంధాలుంచుకోకుండా చేయడానికే సామ్రాజ్యవాదులు ఈ చర్యకు పూనుకున్నారని వారు అర్థం చేసుకొన్నారు. జూలై 24 వ తేదీన కర్నల్ నాజర్ కైరోలో ఉపన్యసిస్తూ యిలా చెప్పాడు :

"ఈ గగ్గోలుకంతా కారకులైనవారికి నేను చెప్పదలచుకొన్న దేమంటే, 'మీ ద్వేషమే మిమ్మల్ని హతమార్చుతుంది.' మీరు మామీద పెత్తనం చేయలేరు. కారణ మేమంటే, మా మార్గ మేమిటో మీకు తెలుసు."

"అల్ అఖ్ బార్" అనే పత్రిక యిలా వ్యాఖ్యానించింది: "ఈజిప్ట్‌దేశ నాయకులు, ప్రజలు అశ్వాన్ డామును నిర్మించదలచుకున్నారు. వారు ఇస్మాయిల్ పాషా పద్ధతి నవలంబించ దలచుకోలేదు. ఇస్మాయిల్ పాషా సూయజ్ కాలువ నిర్మాణంకోసం ఈజిప్ట్‌నే తెగనమ్మాడు. ఇప్పుడు ఈజిప్ట్ అశ్వాన్‌డాము నిర్మాణానికి విదేశాల సహాయం కోరిందంటే, కోట్లాది డాలర్లకోసం తన స్వాతంత్ర్యాన్ని తాకట్టు పెట్టదలచుకోలేదు."

తమ సర్వాంసహాధికారాన్ని అపహరించే విదేశ సహాయాన్ని ఈజిప్ట్ ప్రజలు గడ్డిపోచతో సమానంగా యెంచారు.

ఆర్థికంగా వెనుకబడియున్న దేశాలు తమ జాతీయ పునర్నిర్మాణానికవసరమైన వనరులను సేకరించుకోడాని కెట్టి మార్గ మవలంబించాలో కూడ ఈజిప్ట్ ప్రజలు, ఈజిప్ట్ పాలకులు స్పష్టంచేశారు; జూలై 26 వ తేదీన ఈజిప్ట్ ప్రభుత్వం సూయజ్ కాలువ కంపెనీని జాతీయం చేసింది. తద్వారా లభించే సొమ్ముతో అశ్వాన్‌డామును నిర్మించడానికి నిశ్చయించుకొంది. ఈ నిర్ణయాన్ని లక్షలాది ప్రజలు అత్యంత ఉత్సాహంతో బలపరచారు. కర్నల్ నాజర్ ఒక బ్రహ్మాండమైన బహిరంగసభలో ఉపన్యసిస్తూ, యికమీదట ఎవ్వరూ సూయజ్ కంపెనీధనాన్ని ఈజిప్ట్ ప్రభుత్వం అనుమతి లేనిదే ఖర్చుపెట్టకూడదన్నాడు. కంపెనీ నిధులను బిగపెట్టివేశామని చెప్పాడు. ఇకమీదట సూయజ్ కాలువమీద ఈజిప్ట్‌ప్రభుత్వానికి ఏటా లభించే 10 కోట్ల డాలర్ల సొమ్ముతో అశ్వాన్‌డాము నిర్మింపబడుతుందని తెలియజేశాడు. ఇంకా యిలా చెప్పాడు:

"సామ్రాజ్యవాదులు బాగ్దాద్ కూటమిని నిర్మించి, ఈజిప్ట్‌ను అరకత్తెరలో నొక్కడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నం సాగలేదు. దానితో వారు ఈజిప్ట్‌పై ఆర్థికంగా ఒత్తిడితేవాలని చూస్తున్నారు!...అశ్వాన్ డాము నిర్మాణానికి సహాయంచేసే నెపంతో వారు తమ ఆర్థికదోపిడీని విస్తరించుకోవాలని చూచారు. అవమానకరమైన వారి షరతులను ఈజిప్ట్ నిరాకరించేసరికి వారు తమ వాగ్దానాలను ఉపసంహరించుకొన్నారు. ఆ షరతులను మనం ఒప్పుకొనియుంటే, ఈజిప్ట్ అధ్యక్షుని స్థానాన్ని ప్రపంచ బ్యాంకు డైరెక్టరు ఆక్రమించుకొనియుండేవాడు."

సూయజ్ కంపెనీని పేర్కొంటూ నాజర్ యిలా చెప్పాడు:

"ఇది ఈజిప్ట్‌ను దోచుకుతినే కంపెనీ. ఈ కంపెనీకి అపారమైన అధికారాలున్నాయి. నిజానికిది ఈజిప్ట్‌దేశంలోనే ఒక స్వాతంత్రరాజ్యం వంటిది. సహించడానికి వీల్లేని యీ పరిస్థితి నేటితో అంతమవుతూంది. నేటినుంచీ ఈజిప్ట్

సమగ్రమైన జాతీయ ఆర్థిక వ్యవస్థను నిర్మించుకొంటుంది. సూయజ్ కాలువపై హక్కు ఈజిప్టుది. ఆ హక్కును మనం పునరుద్ధరించుకొంటున్నాం. ఆ కాలువపై వచ్చే రాబడితోనే అశ్వాన్ డాముఁ నిర్మించుకుంటాం."

నాజర్ తన ప్రకటనలో బ్రిటిష్, ఫ్రెంచి వాటాదార్లకు న్యాయమైన పద్ధతిలో నష్టపరిహారం చెల్లిస్తామనీ, ఓడల రాకపోకలకు ఎట్టి అవాంతరాలు ఉండవనీ హామీ యిచ్చాడు.

ఈజిప్టు ప్రభుత్వం తీసుకున్న యీ సాహసోపేతమైన చర్య సామ్రాజ్య వాదులమీద పిడుగుపడ్డట్లు పడింది. బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు ఈజిప్టు ప్రభుత్వానికి నిరసనపత్రాలందజేశాయి. కాని వాటిని ఈజిప్టు త్రోసిపుచ్చింది. సూయజ్ కంపెనీ ఒక అంతర్జాతీయ సంస్థ అనీ, దాన్ని జాతీయం చేసేహక్కు ఈజిప్టు ప్రభుత్వానికి లేదనీ బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాల వాదన. ఈ వాదన నైతికంగాగాని, రాజకీయంగాగాని, న్యాయశాస్త్రరీత్యాగాని సమర్థనీయంకాదు. సూయజ్ కంపెనీ స్థాపింపబడ్డ రోజునుంచీ అది ఈజిప్టుకే చెంది వుంది. దాని ద్వారా సామ్రాజ్యవాదులు కొల్లగొట్టుకున్న సొమ్ము అంతా దోపిడీ సొమ్ము. ఇకముందు అట్టి దోపిడీని అరికట్టడం ఈజిప్టు వంటి స్వతంత్ర ప్రభుత్వం యొక్క ధర్మం. రాజకీయంగా చూస్తే, ఈజిప్టు భూభాగానికి చెందిన కాలువపై వచ్చే ఆదాయాన్ని జాతీయ పునర్నిర్మాణానికి వినియోగించుకునే హక్కు ఈజిప్టుకు ఉంది. న్యాయశాస్త్రరీత్యా, సూయజ్ కంపెనీ ఈజిప్టులో రిజిష్టరయిన కంపెనీ. దాన్ని స్వాధీనం చేసుకోడానికి ఈజిప్టుకు సర్వాధికారం ఉంది.

కాని బలప్రయోగంద్వారా ప్రపంచ రాజ్యాలను కొల్లగొట్టడాని కలవాటు బడ్డ బ్రిటన్, ఫ్రాన్సులు ప్రతీకార చర్యలకు పూనుకున్నాయి. బ్రిటన్‌లో ఈజిప్టుకు గల 11 కోట్ల పౌనుల స్టర్లింగ్ నిల్వలలో ఒక్క చిల్లిగవ్వకూడా యిచ్చేదిలేదని బ్రిటిష్ ప్రభుత్వం ఆంక్ష విధించింది. బ్రిటిష్ సేనలు సూయజ్ కాలువను తిరిగి ఆక్రమించుకుంటాయనే వదంతులు బయల్దేరాయి. వాటికి జవాబిస్తూ కర్నల్ నాజర్ కెయిరోలో యిలా ఉపన్యసించాడు:

"సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఈజిప్టు ప్రజ నేనాడు సాయుధులై నిలబడ్డారు. బలప్రయోగాన్ని బలప్రయోగంతోనే ప్రతిఘటిస్తాం. సామ్రాజ్య వాదుల ఆటల నిక సాగనిచ్చేదిలేదు. మన జైత్రయాత్రను ఆపటం ఎవ్వరితరం కాదు. మన స్వాతంత్ర్యాన్ని, సర్వం సహాధికారాన్ని సుస్థిరం చేసుకు తీరుతాం. సూయజ్ కాలువతో సహా ఈజిప్టు ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కల్పించు కొనే హక్కు బ్రిటన్‌కు లేదు. సూయజ్ కాలువ ఈజిప్టు దేశ అంతర్భాగం. ఈజిప్టు బ్రిటిష్ సామ్రాజ్య భాగమేమీ కాదు. అలాంటప్పుడు యీ నిరసన లేమిటి? ఇక ఫ్రాన్సు విషయమంటారా? ఆ దేశానికి అల్జీరియన్లే తగిన గుణ పాఠం నేర్పుతారు."

జూలై 29 వ తేదీన యీ సమస్యపై మాస్కో రేడియో యిలా వ్యాఖ్యానించింది :

"పశ్చిమ రాజ్యాల పాలకవర్గాలకు యింత దురాగ్రహం కలిగిస్తున్న కారణం ఈజిప్ట్ చర్య సక్రమమైనదా కాదా అనేది కాదు. న్యాయంగా ఈజిప్ట్ ప్రజల సొత్తు అయిన సూయజ్ కాలువను దోచుకొని యింతకాలమూ గడిస్తూ వచ్చిన అపారమైన లాభాలు తమకు దక్కకుండా పోతున్నాయే అన్న ఉక్రోషమే యిదంతా. ఇందుకు మరో కారణంకూడా ఉంది. పశ్చిమ ఆసియా అంతటిలోను వలసదోపిడీ అవశేషాలను పూర్తిగా తుడిచిపెట్టే లక్ష్యంతో ఈజిప్ట్ ప్రభుత్వం స్వతంత్ర విధానాలను అనుసరిస్తూండడమే అది. మొన్న మొన్నటి వరకు తమ చేతిక్రింద వలసగా పడివున్న ఒకదేశం నేడు సర్వస్వతంత్రమై, యితర దేశాలతో - ముఖ్యంగా సోవియటు, చైనా ఇతర సోషలిస్టు దేశాలతో - పరస్పర ప్రయోజనాల ప్రాతిపదికపై సమానహోదాతో సంబంధాలేర్పరచుకోడం పశ్చిమ రాజ్యాలకు కంటుగింపుగా ఉంది."

బ్రిటన్ తీసుకున్న ప్రతీకార చర్యను (స్టెర్లింగ్ నిల్వలను బిగపట్టడం) ఆక్షేపిస్తూ ఈజిప్ట్ ప్రభుత్వం అంతర్జాతీయ న్యాయస్థానంలో ఫిర్యాదు చేసింది.

ఈజిప్ట్ చర్యనుగురించి చర్చించేందుకు లండన్‌లో బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా దేశాల విదేశాంగమంత్రులు ఐదురోజులు సమావేశమయ్యారు. ఈజిప్ట్ చర్యను వారు ఖండించారు. సూయజ్ వ్యవహారాల నిర్వహణకు ఒక కొత్త అంతర్జాతీయ సంస్థను నెలకొల్పే విషయమై సమాలోచనలు జరపడానికి 24 రాజ్యాల సమావేశమొకటి జరపాలనీ, దానికి ఈజిప్ట్, రష్యా, భారతదేశాలను కూడా ఆహ్వానించాలనీ వారు తీర్మానించారు. ఆ సమావేశం ఆగస్టు 16 న జరగాలని నిర్ణయించుకున్నారు.

ఈ తీర్మానం ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని మోసగించడానికే ఉద్దేశింపబడిందని మరునాడు జరిగిన ఘటనలు రుజువుచేశాయి. మరునాడు బ్రిటన్, తూర్పు, మధ్యధరారంగంలో (సూయజ్ ప్రాంతం)అత్యవసరబాధ్యతల నిర్వహణ కంటూ రిజర్వు సైన్యాలలో ప్రత్యేక తరగతుల సైనికుల్ని సమీకరించింది. యుద్ధనౌకలను, విమానదళాలను సూయజ్ ప్రాంతానికి పంపేటందుకు ఉత్తరువులు జారీచేసింది. ఫ్రెంచి ప్రభుత్వం కూడా యిలాగే చేసింది.

పశ్చిమరాజ్యాల విదేశాంగమంత్రులు చేసిన సంయుక్త ప్రకటనపై ఈజిప్ట్ అధ్యక్షు కార్యాలయ ప్రతినిధి వ్యాఖ్యానిస్తూ, అది ఈజిప్ట్‌పై ఒత్తిడి తేవడానికీ, సైనిక బెదరింపులు కొనసాగించడానికీ ఉద్దేశింపబడిందని చెప్పాడు. 1954 ఒడంబడికలో "సూయజ్ కాలువ ఈజిప్ట్‌నుండి విడదీయరాని అంతర్భాగం" అని పేర్కొన్న విషయాన్ని బ్రిటన్ ఆనాడు అంగీకరించిందనీ, ఆ ఒడంబడిక కనుగుణ్యంగానే ఈజిప్ట్‌చర్య ఉందనీ, ఆయన వివరించాడు.

తనను సంప్రతించకుండా 24 రాజ్యాల సమావేశాన్ని ఏర్పరచినందుకు నిరసన తెల్పుతూ ఈజిప్ట్ ప్రభుత్వం అందులో పాల్గొనబోదని ప్రకటించింది.

పశ్చిమ రాజ్యాల సవాలు నెదుర్కోడానికి ఈజిప్ట్ ప్రభుత్వం దేశరక్షణకు సంబంధించిన కొన్ని జాగ్రత్తలు తీసుకొంది. అన్ని పట్టణాలలోను, గ్రామాలలోను సైనిక శిబిరాల నేర్పరచి, వాటిలో యువకులకు శిక్షణ నిస్తోంది. విదేశీ దురాక్రమణ నెదుర్కోడానికి ఈజిప్ట్‌లోని యావన్మంది యువకులు సమీకృతు లవుతున్నారు. ఎగువ ఈజిప్ట్‌లోని 35000 మంది పౌరులు కర్నల్ నాజర్ కొక సందేశం పంపుతూ, తాము సర్వస్వం ఒడ్డి సూయజ్ కాలువను కాపాడుతామని తెలియ చేశారు.

సూయజ్ కాలువపై తమ పెత్తనాన్ని పునరుద్ధరించుకోవాలన్న దుశ్చింతతోనే పశ్చిమ రాజ్యాలవారు 24 రాజ్యాల సమావేశం ఏర్పాటు చేస్తున్నారని సోవియట్ వార్తా పత్రికలు నిశితంగా విమర్శించాయి.

ఆగస్టు 9 వ తేదీన సోవియట్ ప్రభుత్వం 24 దేశాల సమావేశంలో పాల్గొనేందు కంగీకరిస్తూ ఒక ప్రకటనచేసింది. అందులో యిలా తెలియజేసింది :

“సూయజ్ కంపెనీ అంతర్జాతీయసంస్థ అని, దాన్ని జాతీయంచేసేహక్కు ఈజిప్ట్‌కి లేదనీ పశ్చిమరాజ్యాలవారు తమ ప్రకటనలో చేసిన వాదన పూర్తిగా నిరాధారమైనది. దానితో మేము ఏకీభవింపజాలం...సూయజ్ సమావేశాన్ని ప్రతిపాదించిన మూడు పశ్చిమ రాజ్యాలూ చేసిన ప్రకటనలో కొన్ని అంశాలూ, కొన్ని బాధ్యతలూ పేర్కొనబడ్డాయి. అవి సోవియట్‌కి ఎంతమాత్రమూ వర్తించవు. ఈజిప్ట్ సర్వంసహాధికారానికి భంగం కలిగించే మరేవిషయానికి సోవియట్ అంగీకరించదు.

“పశ్చిమ రాజ్యాలు మూడూ తలపెట్టిన సమావేశం అంతర్జాతీయసమావేశం కాజాలదు. సూయజ్ కాలువ విషయమై ఎలాంటి నిర్ణయం చేయగల అధికారం దానికిలేదు. సూయజ్ కాలువను జాతీయంచేస్తూ ఈజిప్ట్ ప్రభుత్వం చేసిన నిర్ణయాన్ని మార్చడానికి ఆ సమావేశంలో ఎట్టి ప్రయత్నం జరిగినా, అది ఈజిప్ట్ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొనే ప్రయత్నమే అవుతుంది.

“బ్రిటన్, ఫ్రాన్స్‌లు యిప్పుడు సాగిస్తున్న సైనిక సన్నాహాలు ఏ మాత్రమూ సహించజాలనివి. ప్రపంచ శాంతికే అవి ఒక సవాలు.”

లండన్ సమావేశానికి 24 దేశాల ప్రతినిధుల్నే గాక చైనాతో సహా మరో 22 దేశాల ప్రతినిధుల్ని కూడా ఆహ్వానించాలని సోవియట్ ప్రభుత్వం తన ప్రకటనలో సూచించింది.

ఆగస్టు 12 న ఈజిప్ట్ అధ్యక్షుడు పత్రికా విలేఖరుల గోష్ఠిలో ప్రసంగిస్తూ లండన్ సమావేశానికి నిర్ణయాలుచేసే అధికారం లేదనీ, ఆ సమావేశంలో ఈజిప్ట్

పొగ్గానబోదనీ తెలియజేశాడు. 1888 ఒడంబడికపై సంతకాలుచేసిన 9 రాజ్యాలనూ, సూయజ్ కాలువద్వారా ఏయేదేశాల నౌకలు ప్రయాణం చేస్తున్నాయో ఆ దేశాల ప్రతినిధులనూ ఆహ్వానించి వేరే సమావేశం జరపాలని అతడు సూచించాడు. ఆ సమావేశంలో జరిగే ఒప్పందాన్ని ఐ. రా. స. కార్యాలయం నమోదు చేయాలన్నాడు.

ఒకవైపు పశ్చిమరాజ్య ప్రభుత్వాలీ విధంగా బలప్రయోగంద్వారా ఈజిప్టును లొంగదీసుకోడానికి బెదరింపులు సాగిస్తూంటే, మరొకవైపు ఆసియా - ఆఫ్రికా దేశాల ప్రజలు, పాలకులు ఈజిప్టు చర్యపట్ల హర్షామోదాలు ప్రకటిస్తున్నారు.

సూయజ్ కంపెనీని ఈజిప్టు ప్రభుత్వం వశపరచుకొందనే వార్త విన్నతోడనే, జోర్డాన్ రాజధాని అమ్మాన్‌లో వేలాది ప్రజలు ఆనందోత్సాహాలతో ప్రదర్శనలు జరిపారు. ఇండోనేషియాలోని జాతీయపత్రికలన్నీ నాజర్ చర్యను అభినందిస్తూ సంపాదకీయాలు వ్రాశాయి. 'సిలోన్ అబ్జర్వర్,' 'సిలోన్ డెయిలీ న్యూస్' 'టైమ్స్ ఆఫ్ సిలోన్' మొదలైన సింహళ పత్రికలు ఈజిప్టు చర్యను బలపరిచాయి. సింహళ ప్రధాని బండారునాయకే "సూయజ్ కంపెనీని జాతీయం చేయడానికి ఈజిప్టుకుగల హక్కును ఎవరూ కాదనలేర"ని ప్రకటించాడు. కర్నల్ నాజర్ ప్రకటన "చరిత్రాత్మకమైన పత్రం" అని చైనా పత్రిక 'క్వాంగ్ మింగ్ డెయిలీ' ప్రశంసించింది "సూయజ్ కాలువ జాతీయకరణ నిర్ణయాన్ని చైనాప్రజలు హృదయపూర్వకంగా బలపరుస్తారు. ఈజిప్టుచర్య బాండుంగ్ సూత్రాలకు అనుగుణ్యంగా ఉంది" అని ఆ పత్రిక వ్యాఖ్యానించింది. 'పీపుల్స్ డెయిలీ' అను మరొక ప్రఖ్యాత చైనాపత్రిక "అక్రమమైన ఒడంబడికలను రద్దుచేయడానికి ఈజిప్టుకు పూర్తిహక్కు ఉంది" అని వ్రాసింది. చైనా ప్రధాని చౌ-ఎన్-లై ఈజిప్టుచర్యను చైనాప్రజలు బలపరుస్తారని తెలియజేశారు. బ్రిటన్, అమెరికాలు నిర్మించిన బాగ్దాద్ సైనికకూటమిలో సభ్యత్వంగల పాకిస్తాన్ సహితం ఈజిప్టుచర్యను సమర్థిస్తున్నట్లు తెలుస్తోంది. పాక్ విదేశాంగమంత్రి హమీదుల్‌హక్ "సూయజ్ కాలువను జాతీయంచేసేహక్కు ఈజిప్టుకున్నద"ని ప్రకటించాడు. పాకిస్తాన్‌లోని 12 రాజకీయ పార్టీలు ఈజిప్టుచర్యను బలపరుస్తూ ఒక సంయుక్తప్రకటనచేశాయి. ఇందుకొక అఖిలపక్షకమిటీనికూడా ఏర్పరచాయి. అమెరికాలోని సిరియారాయబారి పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ, సూయజ్ సమస్యపై ఈజిప్టుతోపాటు సిరియాకూడ పశ్చిమ రాజ్యాలపై యుద్ధం చేయడానికైనాసరే సిద్ధంగా ఉందనీ, అవసరమైతే గెరిల్లాపోరాటం సాగిస్తామనీ తెలియజేశాడు. ఆఫ్గన్ విదేశాంగమంత్రి నయీమ్‌ఖాన్ యిలా ప్రకటించాడు: "కర్నల్ నాజర్ నిరాక్షేపణీయమైన, అద్వితీయమైన చర్యతీసుకున్నాడు. అగ్రరాజ్యాలు చిన్నదేశాలపై బలప్రయోగంచేస్తే చాల విషమపరిస్థితు లేర్పడ

తాయి. ఇకనైనా పశ్చిమరాజ్యాలు సామ్రాజ్యకాంక్షను విడనాడడం మంచిది." అమెరికాలోని సౌదీ అరేబియా రాయబారి ఒక ప్రకటనచేస్తూ, సూయజ్ సమస్యపై తన ప్రభుత్వం ఈజిప్టును బలపరుస్తుందని తెలియజేశారు.

ఈజిప్టుపై సామ్రాజ్యవాదులు చెయ్యిచేసుకుంటే ఒక చుక్క నూనెకూడా అందనీయకుండా గొట్టాలను మూసివేస్తామని సిరియాలోని పెట్రోలు కంపెనీ కార్మికులు పశ్చిమరాజ్యాలను హెచ్చరించారు. ఇరాక్‌లోని బ్రిటిష్ పెట్రోల్ కంపెనీ తాలూకు గొట్టాలు, సౌదీ అరేబియాలోని అమెరికన్ పెట్రోలు కంపెనీ గొట్టాలు సిరియాగుండానే పోతున్నాయి.

అరబ్బు కార్మిక సంఘాల సమాఖ్య ఆగస్టు 11 న కయిరోలో సమావేశమై ఈజిప్టుమీద దాడిచేయాలనుకుంటున్న దేశాల నౌకలనూ, విమానాలనూ బహిష్కరించాలనీ, అలా దాడిచేసే పక్షంలో విదేశ సైనికస్థావరాలను ధ్వంసంచేయాలనీ తీర్మానించింది. ఈజిప్టు నూనెకార్మికులమీద దాడిజరిగితే అరబ్బుదేశాల కార్మికులంతా నూనెగనులనూ, కర్మాగారాలనూ ధ్వంసమొనర్చాలనికూడా నిర్ణయించింది.

భారత ప్రధాని జూలై 31 న ఒక ప్రకటనచేస్తూ, ఈజిప్టు తీసుకున్న చర్యనుబట్టి సామ్రాజ్యవాదం బలహీనపడుతూన్నట్లు, స్పష్టమవుతోందని చెప్పారు. ఆగస్టు 8 వ తేదీన లోక్‌సభలో ఉపన్యసిస్తూ, సూయజ్ కంపెనీని జాతీయంచేసే హక్కు ఈజిప్టుకు ఉన్నదనీ, బ్రిటన్-ఫ్రాన్స్‌లు సైనిక సన్నాహాలను, బెదరింపులను మానుకోవాలనీ హెచ్చరించారు.

భారతప్రభుత్వం, ఈజిప్టుయొక్క సర్వంసహాధికారానికీ, ప్రయోజనాలకూ, ప్రతిష్ఠకూ భంగంలేని విధంగా, సూయజ్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించే లక్ష్యంతో లండన్ సమావేశంలో పాల్గొనడానికి నిశ్చయించుకొన్నట్లు శ్రీ నెహ్రూ తెలియజేశారు. ఏ పరిష్కారమైనా ఆ సమస్యతో సంబంధంగల అన్నిదేశాల ఆమోదాన్ని పొందవలసియుంటుందనికూడా ఆయన వివరించారు. "ఈజిప్టు సర్వంసహాధికారానికి ప్రమాదం తెచ్చే యుద్ధసన్నాహాలలోగాని, ఆంక్షలు విధించడంలోగాని, నౌకాచర్యలు తీసుకోడంలోగాని భారత ప్రభుత్వం భాగస్వామిగా ఉండడానికి నిరాకరిస్తుంది" అని కూడా తెలియజేశారు. లండన్ సమావేశంలో పాల్గొన్నంతమాత్రాన బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికాల సంయుక్త ప్రకటనలోని వైఖరిగాని, అందులోని సూత్రాలనుగాని ఆమోదించినట్లుకాదని ప్రధాని నెహ్రూ వివరించారు. ఈజిప్టు ఆమోదం పొందని ఏ నిర్ణయమూ చెల్లనేరదనికూడా స్పష్టంచేశారు.

ఈజిప్టుచర్య పశ్చిమరాజ్యాలమధ్య ఐక్యతకు గండికొట్టింది. సామ్రాజ్యవాదులతో కలిసి యుద్ధసన్నాహాలలో పాల్గొంటున్న స్పెయిన్, యిదే మంచి సమయమనుకొని, తన దేశంలో భాగమైన జిబ్రాల్టర్ జలసంధిపై బ్రిటన్‌కిగల పెత్తనాన్ని

నిర్మూలించవలచింది. జిబ్రాల్టర్‌పై అధికారం తనదేనని స్పెయిన్ ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియజేసింది. అనేక స్పానిష్ పత్రికలు ఈజిప్టును అభినందిస్తూ సంపాదకీయాలు వ్రాశాయి. గ్రీక్ ప్రజలు అధిక సంఖ్యాకులుగా ఉన్న సైప్రస్ దీవిని బ్రిటన్ తనకు వొప్పజెప్పకుండా, బ్రిటిష్ సేనల ఆక్రమణ క్రింద ఉంచినందుకు అసంతృప్తితో కుములుతున్న గ్రీక్ ప్రభుత్వం, ఈజిప్టువైపు మొగ్గుచూపుతోంది. అట్టి గ్రీకు ప్రభుత్వం లండన్ సమావేశానికి హాజరు కావడానికి నిరాకరించింది. ఇందుకు ఆ దేశ రాజకీయ పరిశీలకులు నాలుగు కారణాలు చెబుతున్నారు: (1) గ్రీసు ప్రజల్లో నాజర్ ప్రభుత్వానికి అనుకూలమైన అభిప్రాయాలు వ్యాపించడం. (2) గ్రీక్ పార్లమెంటులో ప్రతిపక్ష నాయకుడు ఉపన్యసిస్తూ, ప్రభుత్వమెంత నిరసించినా బ్రిటిష్ అధికారులు సైప్రస్ దేశభక్తుల్ని ఉరితీయడం వల్ల లండన్ సమావేశానికి వెళ్లకూడదని హెచ్చరించడం. (3) ఐక్యరాజ్యసమితిలో సైప్రస్ సమస్యపై అరబ్బుదేశాల సహకారాన్ని గ్రీక్ ప్రభుత్వం కోరుతూండడం. (4) బ్రిటన్ - గ్రీసు దేశాలమధ్య యిప్పుడున్న క్లిష్టపరిస్థితుల్లో, లండన్‌కి ప్రయాణమై వెళ్ళనున్న గ్రీక్ మంత్రులపట్ల ప్రజల్లో వ్యతిరేకత రావచ్చుననే అభిప్రాయం. ఒక ప్రభుత్వ ప్రతినిధి యీ సమస్యపై వ్యాఖ్యానిస్తూ, యిలా చెప్పాడు: "గ్రీసు తన జాతీయ ప్రయోజనాలను ఒక్కగా దృష్టిలో వుంచుకొనే, యీ నిర్ణయాని కొచ్చింది. లండన్ సమావేశంలో గ్రీసు తన మిత్రరాజ్యాల విషయంలో యిరకాటమైన పరిస్థితిని కల్పించడాని కిష్టపడ్డంలేదు."

పాకిస్తాన్, అమెరికా పలుకుబడి క్రింద ఉన్న దేశమని మన మెరుగుదుం. బాగ్దాద్ ఒడంబడికపై సంతకం పెట్టిన రాజ్యాలలో అదొకటి. అయినా, పాకిస్తాన్ ఈజిప్ట్ చర్యను సమర్థిస్తోంది. పాక్ విదేశాంగమంత్రి ప్రకటనే ఇందుకు నిదర్శనం. బాగ్దాద్ కూటమిలో చేరిన మరొక దేశం ఇరాక్. సూయజ్ సమస్యపై ఇరాక్ ప్రభుత్వం ఒక అధికార ప్రకటనలో యిలా తెలియజేసింది: "ఈజిప్ట్ తన స్వాతంత్ర్యాన్ని, స్వాధికారాన్ని, ప్రతిష్ఠను కాపాడుకొనేందుకు ప్రయత్నిస్తోంది. అట్టి దేశం తరఫున ఇరాక్ నిలబడుతుంది. సూయజ్ కాలువ సమస్యపై ఇప్పుడేర్పడ్డ తగాదా బుద్ధికుశలతతో పరిష్కరింపబడాలని వాంఛిస్తుంది."

బాగ్దాద్ ఒడంబడికపై సంతకం చేసిన ఇరాన్ కూడా యిట్టి వైఖరినే అవలంబిస్తోంది. ఇరాన్ విదేశాంగ మంత్రి ఒక ప్రకటనలో యిలా తెలియజేశాడు: "మాకు కావలసిందల్లా సూయజ్ కాలువలో నౌకాయాన స్వేచ్ఛకు హామీ. దాని కంగీకరిస్తే ఈజిప్ట్ చర్యను మేము గౌరవిస్తాం (ఇదివరకే యిట్టి హామీ యివ్వబడింది)."

బ్రిటన్, అమెరికాలతో కలిసి ఆగ్నేయాసియా సైనిక కూటమిలో చేరిన తాయిలాండ్ సహితం నాజర్ చర్యను బలపరుస్తోంది. తాయ్ ప్రధాని ఒక

ప్రకటనలో యిలా తెలియజేశాడు: "సూయజ్ కాలువను జాతీయం చేసే సర్వం సహాధికారం ఈజిప్ట్‌కు కలదన్న విషయాన్ని మా ప్రభుత్వం గుర్తిస్తున్నది."

ఈ విధంగా సూయజ్ సమస్యపై పశ్చిమరాజ్యాలలోను, వాటిని బల పరుస్తున్న మధ్యప్రాచ్యదేశాల్లోను విభేదా లున్నాయి. అవి ఈజిప్ట్ ప్రజల పోరాటానికి బలం చేకూర్చుతాయనడంలో సందేహం లేదు.

సూయజ్ కాలువ ఈజిప్ట్ వశమైతే తమ యుద్ధసన్నాహాలు తలక్రిందు లవుతాయనీ, అవసానదశలో నున్న వలసవిధానం మరింత బలహీనపడుతుందనీ సామ్రాజ్యవాదు లీరోజున కంగారుపడుతున్నారు. ఈజిప్ట్ నాయకత్వం క్రింద అరబ్బుదేశాలన్నీ కలిసి, సూయజ్ కాలువను యుద్ధావసరాలకు ఉపయోగించుకో నివ్వకుండా చేస్తాయనే భయం వారిని హడలెత్తిస్తోంది. మొదటి రెండు ప్రపంచ సంగ్రామాలలోవలె సూయజ్ కాలువపై తమకు సర్వాధికారాలుండకపోతే, ప్రపంచాధిపత్యం కొరకు తాము కంటున్న కలలన్నీ పటాపంచ లవుతాయనే గాబరా వారిని పీడిస్తోంది. అంతేకాదు. ఇరాన్, ఇరాక్, సౌదీ అరేబియా మొదలైన దేశాల్లో తమ పెత్తనంక్రింద ఉన్న పెట్రోల్ గనులన్నీ చెయ్యిజారి పోయే ప్రమాద మేర్పడవచ్చు. ఈ ప్రాంతంలో తమ కున్న సైనిక స్థావరా లెంత వరకు ఉపయోగిస్తాయో కూడ చెప్పలేనిస్థితిలో వారు పడ్డారు. అంతేకాదు. ఒక సారి వలసపాలననుంచి విముక్తిచెందిన దేశం, పశ్చిమ రాజ్యాల పెట్టుబడులను స్వాధీనం చేసుకొని, వాటిని తన జాతీయ పునర్నిర్మాణానికి వినియోగించుకొనడం ప్రారంభిస్తే ఇరాక్, సౌదీ అరేబియా, సిరియా, ఇండొనేషియా, ఇండియా మొదలైన దేశాల్లో విదేశీ గుత్తవ్యాపారస్తులకున్న పెట్టుబడులు ఏ నిమిషాన జాతీయం చేయబడతాయో చెప్పలేని స్థితి ఏర్పడుతుంది. ఈ దేశాలన్నింటికీ ఈజిప్ట్ చర్య మార్గదర్శక మవుతుంది. అప్పుడు వలసవిధానమే తుడిచిపెట్టుకు పోవచ్చు. ఆ దృశ్యాన్ని సామ్రాజ్యవాదులు చూస్తూ ఊరుకోగలరా? అప్పుడే ఇండొనేషియా ప్రభుత్వం హాలెండుకు చెల్లించవలసిన 40 కోట్ల 80 లక్షల పౌనుల అప్పును ఇవ్వబోమని ప్రకటించింది. కనుకనే ఇరాన్ ప్రభుత్వం లోగడ నూనె పరిశ్రమను జాతీయం చేసినప్పుడు సామ్రాజ్యవాదులు ముసాదిక్ ప్రభుత్వంపై తిరుగుబాటును రెచ్చగొట్టి, ఆ ప్రభుత్వాన్ని పడగొట్టించారు. ఇప్పుడు ఈజిప్ట్‌ను లొంగదీసుకోడానికి సైనిక చర్యలు తీసుకుంటామని బెదరించడంలో కూడ ఉద్దేశ మిదే.

కాని రోజులు మారాయి. అరబ్బుదేశాల ప్రజలు మేల్కొన్నారు. విదేశ రాజ్యాల పెత్తనాన్ని వారిక సహించరు. సోవియట్ యూనియన్, చైనా ప్రజా రిపబ్లిక్ వంటి సోషలిస్టు దేశాల అండ వారికుంది. ఇండియా, బర్మా, ఇండొనేషియా మొదలైన ఆసియాదేశాల సహకారం వారికి లభిస్తుంది. ఈజిప్ట్ తన స్వాతంత్ర్యాన్ని, సర్వసహాధికారాన్ని కాపాడుకునేందుకు సాగిస్తున్న పోరాటం జయించి తీరుతుంది.

★

29

# కాశ్మీర్



కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)



విశాలాంధ్ర ప్రచురణాలయం,

బకింగ్‌హాంపేట : విజయవాడ.

# విషయసూచిక





# తొలి పలుకు

కాశ్మీర్ సమస్య దాదాపు 9 సంవత్సరాలుగా ఐక్యరాజ్య సమితిలో నలుగుతూంది. దీన్ని పరిష్కరించడానికి ఐక్యరాజ్య సమితిలో మెజారిటీగల ఆంగ్లో-అమెరికన్ రాజ్యాలు అనేక పథకాలు తయారుచేశారు. కాని అవన్నీ అసలు సమస్యను పరిష్కరించక పోగా, కాశ్మీర్ పై సామ్రాజ్యవాదులు పెత్తనం సంపాదించడానికే ఉద్దేశింపబడ్డాయి. ఈ కుట్రలో వారు షేక్ అబ్దుల్లాను సైతం తమ వైపు తిప్పుకో గలిగారంటే, ఆంగ్లో-అమెరికన్ కూటమి ఎంతటి అఘాయిత్యానికి పూనుకుందో తెలుసుకోవచ్చు.

భారత ప్రభుత్వం మొదటి రోజుల్లో సామ్రాజ్యవాదుల ఉద్దేశాన్ని పూర్తిగా గ్రహించక పోయినప్పటికీ, క్రమక్రమంగా మెలకువతో ప్రవర్తించడంవల్ల వారి కుట్రను భగ్నం చేసింది. కాశ్మీర్‌ను ఇండియన్ యూనియన్‌లో భాగంగా గుర్తించి, ఆ రాష్ట్రానికి సహాయం చేస్తూంది.

ఐనప్పటికీ, ఈ సమస్య అపరిష్కృతంగా ఉండడంవల్ల ఇండియా - పాకిస్తాన్‌లమధ్య సత్సంబంధాలు లేకుండా పోయాయి. సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో పాకిస్తాన్ సేనలు సరిహద్దు ఘర్షణలకు దిగుతున్నాయి.

ఈ ఉద్రిక్త పరిస్థితిని అంతమొనర్చేందుకు యిటీవల భారత ప్రధాని ఒక పరిష్కారమార్గం సూచించారు. దాని ప్రకారం, ప్రస్తుత యుద్ధవిరమణ శ్రేణిని ఆధారంగా చేసుకొని, ఉభయ ప్రభుత్వాలు ఒండొరుల భూభాగంమీద దాడులు జరపకుండా నిర్యుద్ధ ఒడంబడిక చేసుకోవాలి. కాని ఈ సూచనను పాకిస్తాన్ పాలకు

లంగీకరించడంలేదు. జనవాక్య సేకరణద్వారానే కాశ్మీర్ సమస్యను పరిష్కరించాలని వారు పట్టుబడుతున్నారు.

ఇండియా - పాకిస్తాన్ దేశాలమధ్య సత్సంబంధా లేర్పడకుండా చేస్తున్న ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల కుట్రను గురించి, ఈ 9 ఏండ్లలో భారత ప్రభుత్వం కాశ్మీర్ విషయంలో అవలంబిస్తూ వచ్చిన విధానాన్ని గురించి సామాన్య పాఠకులకు తెలియజేయడమే ఈ పుస్తకం యొక్క ఉద్దేశం.

కాశ్మీర్ సమస్యను పరిష్కరించేందుకు ప్రధాని నెహ్రూ సూచించిన పరిష్కార మార్గమెంత చక్కనిదో తెలుసుకోడానికి ఈ చిన్న పుస్తకం తోడ్పడగలదని ఆశిస్తున్నాను.

విజయవాడ,<br>10—5—1956. — రచయిత

# 1వ అధ్యాయం

## వంద సంవత్సరాల బ్రిటిష్ పాలన

మనోహరమైన ఉద్యానవనాలతో, నదీనదాలతో, కొండ లోయలతో శోభాయమానంగా విలసిల్లుతున్న కాశ్మీర్, భారతదేశానికి మకుటాయమానంగా ఉత్తరాగ్రదిశలో ఉంది. దీని వైశాల్యం 84,471 చదరపు మైళ్ళు; జనాభా 45 లక్షలు. ప్రపంచం నలుమూలలనుంచి వచ్చే యాత్రీకులు ఇక్కడి ప్రకృతి సౌందర్యం చూచి ముగ్ధులవుతారు.

ప్రాచీనకాలంలో అనేక దేశాల విద్వాంసులు, తత్వవేత్తలు కాశ్మీర్‌ను ఒక సాంస్కృతిక కేంద్రంగా చేసుకొనేవారు. తాత్విక చర్చలలో దీర్ఘకాలం గడిపేవారు.

ఇక్కడి ప్రజలు అనేక చేతికృత్తులలో ప్రావీణ్యం సంపాదించారు. వెండి, రాగి, ఇత్తడి మొదలైన లోహాలమీద వీరుచేసే నగిషీ పని ఎవరికైనా దిగ్భ్రాంతి గొల్పుతుంది. కర్రసామాగ్రి మీద సొంపైన బొమ్మల్లో వీరి కళాప్రతిభ వ్యక్తమవుతుంది. తివాసీలు, శాలువలు, పట్టు వస్త్రాలు మొదలైనవాటికి కాశ్మీర్ ప్రఖ్యాతి చెందింది.

కాశ్మీర్‌ను నాలుగు దేశాల సరిహద్దులు తాకుతున్నాయి. ఉత్తరాన చైనా ప్రజా రిపబ్లిక్ రాష్ట్రాలైన టిబెట్, సింకియాంగ్ లున్నాయి. దక్షిణాన భారత దేశం. పశ్చిమ దిశగా పాకిస్తాన్, పశ్చిమోత్తరంలో ఆఫ్గనిస్తాన్ దేశా లున్నాయి. కాశ్మీర్, సోవియట్ యూనియన్‌లు ఒక చిన్న ఆఫ్గన్ భూభాగంచే వేరుచేయ బడుతున్నాయి.

ఇట్టి కాశ్మీర్, వందసంవత్సరాలకు పైగా బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దురాక్రమణ కుట్రల్లో కీలకస్థానం ఆక్రమించింది.

భారతదేశంపై బ్రిటిష్ పాలకులు పెత్తనం సంపాదించి, తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకొనేందుకు కాశ్మీర్‌ను ఒక సాధనంగా వినియోగించుకున్నారు. కాశ్మీర్ ప్రజల స్వాతంత్ర్యాన్ని అపహరించి, వారి శాంతియుత జీవితాన్ని భగ్న మొనరించారు.

జమ్మూ - కాశ్మీర్ అని ప్రస్తుతం పిలువబడే భూభాగం బ్రిటిష్ ప్రభుత్వంచే 1846 లో సృష్టింపబడింది. సిక్కుల రాజ్యాన్ని పరిపాలించే మహారాజా రంజిత్ సింగ్ వద్ద కొంతకాలం సైన్యాధిపతిగా పనిచేసిన గులాబ్‌సింగ్‌ని బ్రిటిష్‌వారు కాశ్మీర్ రాజుగా చేశారు. ఆఫ్ఘనిస్తాన్‌ని వశపరచుకోడానికి, పంజాబును లొంగ దీసుకోడానికి బ్రిటిష్‌వారు జరిపిన యుద్ధాలలో గులాబ్‌సింగ్ చేసిన సహాయాని దికి "ప్రత్యుపకారం." బెంగాల్లో మీర్ జాఫర్ చేసిన దేశద్రోహమే గులాబ్‌సింగ్ పంజాబులో చేశాడు.

1842 ఏప్రిల్ 8న బ్రిటిష్ ప్రభుత్వం వ్రాసిన ఒక జాబులో యిలా ఉంది:

"మీరు మా సైనికులకు సహాయం చేయడాని కెంత నేర్పుతో పనిచేశారో, ఎంత దయగా మీరు ప్రవర్తించారో మా సేనానాయకులద్వారా విన్నాం...... మన మధ్య చాలకాలంగా వున్న స్నేహం ఎంత చక్కని ఫలాన్నిచ్చిందో ఇప్పుడు కనిపిస్తూంది......ప్రపంచ మనే ఉద్యానవనంలో మీరొక సుందర కుసుమం......మా సైన్యానికి మీరు చేసిన సహాయం మరపురానిది."

ఇక గులాబ్‌సింగ్ తన పట్టాభిషేక సమయంలో అన్నమాటలనుకూడా విందాం. అతడు "నిలబడి చేతులు జోడించి, బ్రిటిష్ వైస్రాయికి కృతజ్ఞత తెల్పుతూ మాట్లాడాడు. తాను బంగారానికి అమ్ముడుపోయిన బానిసనని చెప్తూ వున్నాడు." (జె. డి. కన్నింగ్‌హాం: 'సిక్కుల చరిత్ర' అనే గ్రంథంనుంచి)

1846 మార్చి 16 న జరిగిన అమృతసర్ సంధి ప్రకారం కాశ్మీరు, గిల్గిట్ ప్రాంతం గులాబ్‌సింగ్ వశమయాయి. ఇవి అప్పటివరకూ సిక్కు ప్రభుత్వం క్రింద ఉండేవి. జమ్మూ, లడక్, బాల్టిస్థాన్ రాష్ట్రాలు అదివరకే గులాబ్‌సింగ్ పెత్తనంక్రింద ఉండేవి. కాశ్మీర్, గిల్గిట్‌లను తనకు స్వాధీనం చేసినందుకు గులాబ్‌సింగ్ బ్రిటిష్‌వారికి రు. 75 లక్షలు సొమ్ముకూడా యిచ్చాడు.

గులాబ్‌సింగ్ పట్టాభిషేకమైతే చేసుకున్నాడుగాని, తన ప్రజలచే ద్రోహిగా పరిగణించబడ్డాడు. సిక్కు సేనలు అతనిపై తిరుగుబాటు చేశాయి. ఉభయసేనల మధ్య పోరాటంలో అతని సేనాధిపతి వజీర్ లఖ్‌పతి తన ప్రాణా లను కోల్పోయాడు. వెంటనే గులాబ్‌సింగ్ బ్రిటిష్ ప్రభుత్వాన్ని శరణు జొచ్చాడు. అతడు బ్రిటిష్ సైనికుల సహాయంతోగాని శ్రీనగర్ ప్రవేశించలేక పోయాడు.

ఈ విధంగా, బ్రిటిష్‌వారు పంజాబులో ఒక భాగాన్ని తమ అడుగులకు మడుగులొత్తే గులాబ్‌సింగ్‌కి స్వాధీనంచేసి, మిగతాభాగాన్ని 1849 లో చిలియ న్వాలా యుద్ధం ఫలితంగా హస్తగతం చేసుకున్నారు. ఈ యుద్ధంలో కాశ్మీర్ ప్రభుత్వం బ్రిటిష్ సేనలకు పూర్తిగా సహాయం చేసింది.

1857 లో ఝాన్సీ లక్ష్మిబాయి, నానా సాహెబ్ మొదలైనవారి నాయ కత్వాన జరిగిన భారత స్వాతంత్ర్య సమరంలో కూడా కాశ్మీర్ బ్రిటిష్ ప్రభు త్వానికి సహాయం చేసింది.

19 వ శతాబ్దపు ఉత్తరార్ధభాగంలో కాశ్మీర్ ప్రాముఖ్యత మరీ పెరిగింది. జారిస్టు రష్యా మధ్య ఆసియా రాజ్యాలను కాజేయడానికి తీవ్రమైన ప్రయత్నాలు ప్రారంభించడంతో, బ్రిటన్ - రష్యాల మధ్య పోటీ ఏర్పడింది. బ్రిటిష్ ప్రభుత్వం తన సామ్రాజ్య హద్దులను ఉత్తర దిశగాను, పశ్చిమోత్తర దిశగాను విస్తరింపజేసుకోవడానికి ప్రయత్నిస్తూన్న సమయంలో రష్యా సేనలు మధ్య ఆసియాలోని కోఖండ్, బొఖారా, ఖైవా అనే మూడు స్వతంత్ర రాజ్యాలమీద దండెత్తి వాటిని వశపరచుకున్నాయి. అంతటితో అవి ఆగక, దక్షిణ దిశగా హిందూకుష్ పర్వతశ్రేణిని దాటి, కాశ్మీర్ సరిహద్దుల వైపు పురోగమించాయి. ఒక రష్యన్ సేనాని తన బలగాలతో కాశ్మీర్ పరిపాలనక్రిందవున్న చిత్రాల్ ప్రవేశించాడు. మరుసటి సంవత్సరం ఇంకొక రష్యన్ ఆఫీసరు తన కొసాక్ సైనికుల్ని వెంటపెట్టుకొని చిత్రాల్ మీదుగా ఆఫ్గన్ భూభాగంలో ప్రవేశించాడు. కాశ్మీర్ సరిహద్దునవున్న గిల్గిట్, హుంజా, నాగర్, చిత్రాల్ జిల్లాలు ఆనాటి జారిస్టు సేనానుల్ని బాగా ఆకర్షించాయి. బ్రిటిష్ ప్రభుత్వం వీటిని తన ప్రత్యక్షపాలన క్రిందికి తెచ్చుకోకముందే వాటిమీద రష్యా జెండా ఎగురవేయాలని వారు ఉవ్విళ్లూరుతున్నారు.

ఈ పథకాలు తమ ఆధిపత్యానికి ప్రమాదం తెచ్చిపెడతాయని బ్రిటిష్ పాలకులు భయపడ్డారు. భారతదేశానికి నీళ్ళు వదులుకొనే స్థితి కూడా ఏర్పడవచ్చునని గాబరా పడ్డారు. కాశ్మీర్ సరిహద్దునవున్న ప్రాంతాలను రక్షించుకోవడం తమ తక్షణ లక్ష్యంగా వారు పరిగణించారు. ఇందుకోసం వరుసగా కొన్ని చర్యలు తీసుకున్నారు.

మొదటి చర్య కాశ్మీర్‌లో తమ సొంత రాజకీయాధికారిని నియమించడం. కాశ్మీర్ సరిహద్దుల రక్షణ అతని ప్రత్యేక బాధ్యతగా పేర్కొనబడింది. భారత ప్రభుత్వం పదే పదే చేసిన హెచ్చరికల ఫలితంగా, 1885 లో బ్రిటిష్ ప్రభుత్వం తన రెసిడెంటును కాశ్మీరులో నియమించింది.

రెండవది కాశ్మీర్ సేనల పరిస్థితిని బాగుపరచడం. ఆనాడు కాశ్మీర్ సేనలకు ఆధునిక ఆయుధాలు తగినన్ని లేవు. సైనికుల తరఫీదు అధ్వాన్నంగా ఉండేది. కాశ్మీర్‌లో బ్రిటిష్ రెసిడెంటు ఉన్నప్పటికీ, గిల్గిట్‌పై అధికారం కాశ్మీర్ మహారాజుది. అతడు 6000 సైనికుల్ని గిల్గిట్ సరిహద్దున ఉంచాడు. కాశ్మీర్ ప్రభుత్వం తన ఆదాయంలో సగంవరకు 17,000 సైనికులమీద ఖర్చు చేయవలసి వచ్చేది. అయినా ఒకసారి హుంజా, నాగర్ ప్రాంతాల సాయుధ బలాలు కాశ్మీర్‌పై దండెత్తివచ్చినప్పుడు యీ సేనలు పలాయనం చిత్తగించాయి. అటువంటప్పుడు యివి జారిస్టు సేనల దాడి నెదుర్కోవడం అసంభవమని బ్రిటిష్ అధికారులు తెలుసుకున్నారు. అందుచేత కాశ్మీర్ సేనలను ఆధునిక పద్ధతుల్లో

శిక్షణ గరపడానికి, సరియైన ఆయుధాలిచ్చి తర్ఫీదు చేయడానికి నిశ్చయించుకొని, యిందుకు కొన్ని చర్యలు గైకొన్నారు.

మూడవది గిల్గిట్‌పై ప్రత్యక్షాధికారం నెలకొల్పడం. ఈ స్కీము ప్రకారం గిల్గిట్ నామమాత్రంగా కాశ్మీర్ ప్రభుత్వంక్రింద ఉంటుంది. కాని ఒక బ్రిటిష్ రెసిడెంటుచేతిలో సర్వాధికారాలు ఉంటాయి. బ్రిటిష్ సైనికాధికారులక్రింద సాయుధబలాలు పనిచేస్తాయి. శ్రీనగర్ - గిల్గిట్‌లమధ్య సైనికుల ఉపయోగార్థం ఒక గట్టిరోడ్డు నిర్మింపబడింది. అధునిక ఆయుధాలతో సైనికుల తర్ఫీదు ప్రారంభమైంది.

ఆరోజుల్లో గిల్గిట్‌నిగాని, కాశ్మీరును గాని తమ ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందికి తెచ్చుకుంటే కాశ్మీర్ ప్రభుత్వం తిరగబడుతుందనీ, తత్కాలంగా ఎన్నో చిక్కులేర్పడతాయనీ బ్రిటిష్‌పాలకులు భావించారు. అందుచేత, పేరుకుమాత్రం కాశ్మీరును "స్వతంత్ర" రాజ్యంగా గుర్తించి, పరోక్షంగా దానిపై తమ అధికారాన్ని స్థాపించుకున్నారు.

ఈ పథకాన్ని అమలు జరపడంలో వారెంతటి నీచత్వానికైనా వెనుదీయలేదు. ఉదాహరణకు ఒక ఉదంతం చూడండి. మహారాజా ప్రతాపసింగ్ (కాశ్మీర్ రాజు) జారిస్టు రష్యాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాడనీ, తన సోదరుల్నీ బ్రిటిష్ రెసిడెంటునీ హత్యచేయడానికి కుట్రపన్నాడనీ బ్రిటిష్ రెసిడెంటు అబద్ధారోపణ చేశాడు. దీన్ని ధృవపరచడానికి కొన్నిపత్రాల మీద దొంగసంతకాలు పెట్టించాడు. ప్రతాప్‌సింగు వద్దకెళ్ళి, వాటిని చూపించి వెంటనే గద్దె దిగమని ఆజ్ఞాపించాడు! గత్యంతరంలేక ప్రతాప్‌సింగ్ పదచ్యుతి చేశాడు. అతని స్థానంలో బ్రిటిష్ పాలకులు తమ అడుగులకు మడుగులొత్తే కొందరిని చేరదీసి మంత్రివర్గాన్నేర్పరచారు. అప్పటి నుంచీ పేరుకు మాత్రమే కాశ్మీర్ రాజు ప్రభుత్వాధిపతి. అసలు అధికారం బ్రిటిష్ రెసిడెంటుది.

గిల్గిట్‌ని తమ సొంత సైనిక స్థావరంగా చేసుకోడానికి బ్రిటిష్‌వారు తీసుకున్న చర్యలు యివి.

ఇక హుంజా, నాగర్, చిత్రాల్ సామంతరాజ్యాలు మిగిలాయి. వీటి నాయకులతో బ్రిటిష్ ప్రభుత్వం రాజీ చేసుకోడానికి మొదట ప్రయత్నించింది. కాని ఆ ప్రయత్నాలు విఫలమవడంతో ఇండియా ప్రభుత్వం వారికొక అంతిమ హెచ్చరిక చేసింది. గిల్గిట్ నుంచి హుంజా, నాగర్‌లకు ఒక రోడ్డును నిర్మించడానికి అంగీకరించమని తెలియజేసింది. కాని వారందుకు నిరాకరించారు. వెంటనే బ్రిటిష్ సేనలు కర్నల్ డ్యూరాండ్ నాయకత్వాన ఆ రెండు జాతుల ప్రజలపై దాడులు జరిపి, అమానుషమైన హత్యాకాండద్వారా వారిని లొంగదీసుకున్నారు.

ఈవిధంగా హిందూకుష్ ప్రాంతం బ్రిటిష్‌సేనల ఆక్రమణ క్రిందికివచ్చింది. జారిస్టుసేనల దాడులను విజయవంతంగా ప్రతిఘటించగల శక్తిని వారు సంపా

దించారు. 1895 లో పశ్చిమోత్తర సరిహద్దునవున్న చిత్రాల్ మీదకూడా బ్రిటిష్ సేనలు దాడి జరిపి, దాన్ని మరొక సైనికస్థావరంగా చేసుకున్నారు.

1917లో జరిగిన అక్టోబర్ మహావిప్లవం జార్ చక్రవర్తుల పరిపాలనకు స్వస్తివాచకం చెప్పింది. సోవియట్ ప్రభుత్వం ప్రాచ్యదేశాల ప్రజల్ని సంబోధిస్తూ, వారి స్వాతంత్ర్యాన్ని అపహరించేందుకు జారిస్టుప్రభుత్వం చేసుకున్న రహస్య సంధులన్నిటినీ రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది. సామ్రాజ్యవాదుల వలసవిధానాన్ని ఖండించింది. అన్ని దేశాల ప్రజలు స్వేచ్ఛావాయువు పీల్చుకుంటూ సుఖంగా జీవించడమే తన పరమావధి అని స్పష్టంచేసింది. ఈ ప్రకటన బ్రిటిష్ పాలకుల్ని హడలెత్తించింది. సోవియట్ యూనియన్ పొరుగున వున్న కాశ్మీర్ ప్రజల్లో స్వాతంత్ర్యభావాలు వ్యాపిస్తే తమ మనుగడ దుర్లభ మవుతుందని వారు భయపడ్డారు. కాశ్మీర్‌లోని బ్రిటిష్ రెసిడెంటు బోల్షివిక్ సాహిత్యంపై కఠినమైన ఆంక్షలు విధింపజేశారు.

అదేసమయంలో, బ్రిటిష్ ప్రభుత్వం మధ్య ఆసియాలోని అమీర్ల, ఖాన్‌ల అధికారాన్ని తిరిగి నెలకొల్పేందుకు అనేక రహస్య సాయుధదళాలను పంపింది. సోవియట్ అధికారాన్ని కూలద్రోయడమే వీరి లక్ష్యం. ఈ రహస్య దళాలకు కాశ్మీర్ బలమైనకేంద్రంగా ఉండేది. జారిస్టు ప్రభుత్వంక్రింద సేనానాయకులుగా పనిచేసిన కొందరు ఈ విషయాన్ని బాహాటంగా అంగీకరించారు. కాశ్మీర్‌కి సరిహద్దునవున్న గిల్గిట్ బ్రిటిష్ సాయుధబలాలకు, గూఢచారులకు స్థావరంగా ఉండేది. అక్కడనుంచి వారు మధ్య ఆసియాలోని సోవియట్ రిపబ్లిక్‌లలో తిరుగుబాట్లను రెచ్చగొట్టారు. కాని యీ ప్రయత్నాలన్నీ విఫలమయాయి.

# 2 వ అధ్యాయం

## 'క్విట్ కాశ్మీర్' ఉద్యమం

జమ్మూ - కాశ్మీర్ పరిపాలనా సౌలభ్యంకొరకు 3 రాష్ట్రాలుగా విభజింపబడింది. కాశ్మీర్ రాష్ట్రంలో అధిక సంఖ్యాకులు కాశ్మీరీలు. జమ్మూ రాష్ట్రంలో డోగ్రా జాతివారు అధిక సంఖ్యాకులు. అయినా, పంజాబీలు కూడ చాలమంది ఉన్నారు. సరిహద్దు ప్రాంతమైన లడక్, బాల్టిస్తాన్, ప్రజలు టిబెటన్ భాషకు దగ్గరగాఉండే భాషను, దర్దిస్తాన్ భాషను వాడుతారు.

కాశ్మీర్ ప్రజలు అనేక శతాబ్దాలుగా భూస్వామ్య విధానమనే యినుప పిడికిలిలో నికృష్ట జీవితం గడుపుతూ వచ్చారు. అత్యంత జుగుప్సాకరమైన యీ పైశాచిక విధానాన్ని కాశ్మీర్ మహారాజు పోషిస్తూ వచ్చాడు. కష్టజీవులైన కాశ్మీర్ రైతులన్ని భూస్వాములు పెట్టేబాధలు వర్ణనాతీతం. మొత్తం జనాభాలో 100 కి 90 మంది భూస్వాముల, సాహుకార్ల భూమిని సేద్యంచేస్తూ, తమ కష్టార్జితంలో అధికభాగాన్ని వారికి ధారాదత్తంచేసి, నిత్య దారిద్ర్యంతో, ఆకలి బాధతో జీవితం గడిపేవారు. పన్నులభారం, ఋణభారం వారిని మరీ కృంగదీసేవి.

సరియైన రాకపోక మార్గాలు లేకపోవడంవల్ల, అమ్మకం వస్తువులపై పన్నులు విపరీతంగా ఉండడంవల్ల సామాన్య ప్రజలకు జీవితావసర వస్తువులు, మందులు అందుబాటులో ఉండేవికావు. వీటికితోడు నిరంకుశాధికారుల జులుం, లంచగొండితనం విశృంఖలంగా సాగిపోయేవి.

రైతులు వ్యవసాయంవల్ల లభించేకొద్దిపాటి ఆదాయంతో తమ కుటుంబాలను పోషించుకోలేక, చేతివృత్తులను చేబట్టారు. అనేకమంది ఉపాధికోసం ఉత్తరభారత్ నగరాలకు చేరుకోవడం, అక్కడ కూలీలుగా పనిచేసి తిండి - బట్ట లేక నానా అవస్థలుపడి మళ్లీ కాశ్మీర్‌కే వెళ్ళిపోవడం - సర్వసామాన్యంగా జరిగేవిషయం.

కాశ్మీర్‌లో చెప్పుకోదగ్గ ఆధునిక పరిశ్రమలు లేవు. శ్రీనగర్‌లో ఒక ఉన్ని బట్టలమిల్లు, ఒక సిల్కు-నూలు ఫ్యాక్టరీ, ఒక సిల్కు-నేత ఫ్యాక్టరీ, ఒక జాయినరీమిల్లు మాత్రమే ఉండేవి. జమ్మూలో ఒక ప్రభుత్వ సిల్కు-ఫ్యాక్టరీ,

ఒక మందుల పరిశోధనాలయం ఉండేవి. మోటారు బస్సులు, లారీలతో 1500 మంది మాత్రం పనిచేసేవారు.

కాశ్మీర్‌లో అమూల్యమైన ఖనిజాలెన్నో దొరుకుతాయి. 1923 లో మహారాజా ఒక బ్రిటిష్ కంపెనీచే జరిపించిన భూగర్భ పరిశోధనల ఫలితంగా అనేక ఖనిజాలు కాశ్మీర్‌లో దొరుకుతాయని వెల్లడిఅయింది. ఉదాహరణకు, జమ్మూ రాష్ట్రంలోని రియాసిజిల్లాలో బొగ్గు, మెగ్నీషియమ్, బాక్సైట్ గనులు చాలా వున్నాయి. ప్రపంచంలోకల్లా శ్రేష్టమైన అల్యూమినం దొరికే ప్రాంతాలిక్కడెన్నో ఉన్నాయి. అతి చౌకగా యీ లోహాన్ని తవ్వి తీయవచ్చు. ఇటీవల జరిగిన పరిశోధనలవల్ల, రియాసీ జిల్లాలోనే ఇనుము, రాగి, మాంగనీసు, తుత్తునాగం మొదలైన లోహాలు కొల్లలుగా లభిస్తాయని ఋజువైంది. పెట్రోలు, లిగ్నైటుకూడా యీ ప్రాంతంలో లభిస్తాయి. జలవిద్యుత్కేంద్రాలనుకూడా పెద్దయెత్తున నిర్మించడానికి అవకాశాలున్నాయి. ఇంత సహజసంపద కాశ్మీర్‌లో ఉన్నప్పటికీ, ఆధునిక పరిశ్రమలను అభివృద్ధి చేయాలనే దృష్టి కాశ్మీర్ రాజుకి లేకపోయింది. వేలాది కార్మికులకు జీవనోపాధి కల్పించేందుకు యీ సహజసంపద ఎంతగానో ఉపయోగపడేది.

ఇట్టి పరిస్థితుల్లో ప్రజలు ప్రధానంగా కుటీర పరిశ్రమలపై ఆధారపడవలసి వచ్చింది. వీటిలో ముఖ్యమైనది ఉన్నిబట్టల పరిశ్రమ. అందమైన శాలువలకు, తివాసీలకు, ట్వీడ్ మొదలైన రకాల బట్టలకు కాశ్మీర్ ప్రఖ్యాతి చెందింది. కాశ్మీర్ సిల్కువస్త్రాలుకూడా జగత్ప్రసిద్ధమైనవే. నగిషీపని, అల్లిక పనికూడా వ్యాప్తిలో ఉన్నాయి. అయితే యీ వస్తువులకు మార్కెట్ బహు పరిమితమైనది. ప్రధానంగా విదేశీ యాత్రికులు, యితరదేశాల వర్తకులు మాత్రమే వీటిని కొంటారు.

ఇక ఎగుమతి - దిగుమతుల విషయం చూదాం. 1938 - 39 లెక్కల ప్రకారం కాశ్మీర్ దాదాపు రు. 2½ కోట్ల విలువగల సరుకులు దిగుమతిచేసుకొంది. అవి యీవిధంగా ఉన్నాయి: నూలు బట్టలు రు. 68 లక్షలు; తేయాకు రు. 30½ లక్షలు; ఉన్ని బట్టలు రు. 9½ లక్షలు; నూనెలు రు. 17½ లక్షలు; పండ్లు, కూరగాయలు రు. 3½ లక్షలు. కాని ఎగుమతుల విలువ రు. 1½ కోట్లు మాత్రమే. ఈ అంకెలనుబట్టి, కాశ్మీర్ ఆర్థికంగా ఎంత వెనుకబడియుందో బోధపడుతుంది. ఉన్నిబట్టలు, నూనెలు, పండ్లు, కూరగాయలు కాశ్మీర్‌లో కొల్లలుగా లభిస్తున్నప్పటికీ, వాటిని దిగుమతి చేసుకోవలసిన అగత్యం ఏర్పడింది! దిగుమతి పన్నులు సరుకు ఖరీదులో సగం వరకు ఉండేవి. అందుచేత వాటికి విపరీతమైన ధరలు చెల్లించుకోవలసి వచ్చేది.

ఇక ఇండియాతో, కాశ్మీర్‌కీ వర్తక సంబంధాలెలా ఉండేవో ప్రక్క పేజీలోని అంకెలనుబట్టి తెలుసుకోవచ్చు.

| సంవత్సరం | మొత్తం దిగుమతుల విలువ | భారతదేశం నుంచి దిగుమతులు |
|---|---|---|
| 1944 - 45 | రు. 5,80,00,000 | రు. 4,60,00,000 |
| 1945 - 46 | రు. 5,60,00,000 | రు. 4,70,00,000 |
| 1946 - 47 | రు. 7,10,00,000 | రు. 5,90,00,000 |

పైమూడు సంవత్సరాల్లో జరిగిన ఎగుమతులలో 100 కి 80 వంతులు భారతదేశానివి.

కాశ్మీర్ ప్రభుత్వానికి ఆదాయం ప్రధానంగా దిగుమతి పన్నులనుంచి అటవీసంపదలనుంచి వచ్చేది. ఈవిధంగా వచ్చే రు 2 కోట్ల 75 లక్షలలో కాశ్మీర్ ప్రభుత్వం ప్రజా సంక్షేమశాఖలకు రు 61 లక్షలు మాత్రమే ఖర్చుచేసేది. రు 41 లక్షలు పరిపాలనా యంత్రానికి ఖర్చు అయ్యేవి. దాదాపు రు 1 కోటి రాజుగారి సొంత ఖర్చులకు కేటాయింపబడేది. మిగతాధనం సైన్యానికి ఖర్చు చేయబడేది.

ఇట్టి ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులకు వ్యతిరేకంగా కాశ్మీర్ ప్రజలు 1931 లో బాధ్యతాయుత పరిపాలన కోరుతూ ఒక ఉద్యమాన్ని సాగించారు. కాని అది కొద్దికాలంలోనే అణచివేయబడింది.

రెండవ ప్రపంచయుద్ధం సమాప్తమైన తర్వాత, యావద్భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజావెల్లువ పొంగిపొరలుతూన్నప్పుడు కాశ్మీర్‌ప్రజలుకూడా తమ ఫ్యూడల్ నిరంకుశ ప్రభుత్వంమీద తిరుగుబాటు ప్రారంభించారు. ఇదే "క్విట్ కాశ్మీర్" ఉద్యమం. దీనికి జాతీయ మహాసభ అనే సంస్థ నాయకత్వం వహించింది. షేక్ అబ్దుల్లా మొదలైనవారు దీన్ని స్థాపించారు.

బ్రిటిష్ రాజకీయశాఖ క్రింద గులాంగా పనిచేసే కాశ్మీర్ ప్రధాని రామచంద్రకాక్, బ్రిగేడియర్ స్కాట్ అను బ్రిటిష్ కమాండర్ సలహాపైన, జనరల్ పవెల్ అను బ్రిటిష్ పోలీసు ఉన్నతాధికారి తోడ్పాటుతో ప్రజాతంత్ర ఉద్యమాన్ని అణచేందుకు ఒక పథకాన్ని తయారుచేశాడు. 1946 లో అతడొక ప్రకటనలో యిలా తెలియజేశాడు:

"ఇందుకు మేము సమాయత్త మవుతున్నాం. 11 మాసాల అనంతరం మేము యీ సవాలును ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నాం. ఇక ఊగిసలాట యేమాత్రం ఉండదు. బలహీనతతో కూడుకున్న విధానాన్ని అవలంబించం. మేము నిర్దాక్షిణ్యంగా, క్రూరంగా ప్రవర్తించదలచుకున్నాం."

ప్రజావుద్యమాన్ని అణచేందుకు కాశ్మీర్ ప్రభుత్వం తక్షణచర్యలు తీసుకుంది. రెండవ ప్రపంచయుద్ధంలో మధ్యప్రాచ్య రంగాలకు పంపబడ్డ సైని

కుల్ని విమానాలమీద తీసుకొచ్చింది. ప్రదర్శకులమీద, గుంపులమీద తుపాకులు కాల్చడంలో పోలీసులకు తర్ఫీదునిచ్చింది. ఇంచుమించు అన్ని పట్టణాల్లోను గూఢచారుల్ని గుప్పించింది. కాశ్మీర్ జాతీయ మహాసభ తన కార్యక్రమాన్ని ప్రకటించిన వెంటనే సైనికులు, పోలీసులు బ్రిటిష్ ఆఫీసర్ల నాయకత్వం క్రింద ప్రజలపై వేటకుక్కల మాదిరిగా దుమికారు.

1946 మే నెలలో జాతీయ మహాసభ తన లక్ష్యాన్ని ప్రకటిస్తూ ఒక తీర్మానం చేసింది. ఫ్యూడల్ నియంతృత్వ ప్రభుత్వాన్ని రద్దుచేయడమే తన ఆశయమని అందులో తెలియజేసింది. ఇందుకు కాశ్మీర్ ప్రజలందరూ ఐక్యతతో పోరాడవలసిందని విజ్ఞప్తి చేసింది. భూస్వామ్య విధానాన్ని నిర్మూలించి ప్రజా స్వామ్య పద్ధతులపై నూతన ప్రభుత్వాన్ని స్థాపించాలని స్పష్టం చేసింది.

ఆ రోజుల్లో బ్రిటిష్ మంత్రివర్గ ఉపసంఘం (క్రిప్స్, పెథిక్ లారెన్స్, హొరేస్ అలెగ్జాండర్) కాంగ్రెసు నాయకులతోను, ముస్లిం లీగ్ నాయకుల తోను రాజీ సంప్రతింపులు జరపడానికి భారతదేశం పర్యటిస్తున్నారు. వారికి జాతీయ మహాసభ సమర్పించిన మెమొరాండంలో, తమ పూర్వఆశయమైన బాధ్యతాయుత పరిపాలనకు బదులు నిరంకుశ రాచరిక ప్రభుత్వపు రద్దును కోరు తున్నామని వివరించారు. వారిలా తెలియజేశారు :

"ఈ రోజున కాశ్మీర్ ప్రజల జాతీయవాంఛ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని స్థాపించమని కాదు. డోగ్రా రాజవంశంయొక్క నిరంకుశ రాచరిక ప్రభుత్వం నుంచి వారు విముక్తిచెంద గోరుతున్నారు. దాదాపు వంద సంవత్సరాల క్రిందట ఈస్టిండియా కంపెనీ ఏజంట్లు దురాశతో బలవంతంగా రుద్దిన ఒడంబడికకు కాశ్మీర్ ప్రజలు బలిచేయబడ్డారు. ఆ విక్రయ పత్రం నైతికంగా గాని, రాజ కీయంగా గాని చెల్లదు. అందులో కాశ్మీర్ ప్రజలు భాగస్వాములు కారు. 1846 నుంచీ అది ప్రజల బానిస పత్రంగానే ఉంటూ వచ్చింది."

ఈ మెమొరాండం ప్రకటింపబడగానే, కాశ్మీర్ ప్రజా ఉద్యమానికొక నూతన ఉత్తేజం కలిగింది. "క్విట్ కాశ్మీర్" (కాశ్మీర్‌నుంచి వైదొలగు!) అనే నినాదం ఒక సింహగర్జన అయింది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులీ ఉద్యమాన్ని అణచేందుకు ఎన్నో పైశాచిక పద్ధతుల వలంబించారు. జాతీయ మహాసభ నాయకుల్నీ, ప్రచారకుల్నీ, ముఖ్య కార్యకర్తల్నీ అరెస్టుచేశారు. కార్మిక నాయకుల్నీ, విద్యార్థి - యువజనోద్యమ కార్యకర్తల్నీ జైళ్లలో బంధించారు. సర్వాధికారాలు సైన్యానికివ్వబడ్డాయి. ఈ సైనికులు అమానుషంగా, అడవిమృగాలవలె ప్రజలమీదపడి చేయరాని అత్యాచారాలెన్నో చేశారు. ప్రజానాయకుల అరెస్టులను ఖండిస్తూ శాంతి యుతంగా ఊరేగింపులు జరిపిన ప్రజలమీద అగ్నివర్షం కురిపించారు' అనేక మందిని కాల్చి చంపారు. ఉద్యమంతో ఏ మాత్రం సానుభూతి ఉన్నట్లు అను మానింపబడినా, అట్టివారిని చిత్రహింసలకు గురిచేశారు. ప్రజల పోరాటదీక్షను

దెబ్బతీయడానికి అనేక పేటల మీద సమిష్టి జరిమానాలు విధించారు. ఈ సందర్భంలో పండిత జవహర్లాల్ నెహ్రూ యిలా తెలియజేశారు :

"కాశ్మీర్ లోయ అంతా సైనిక పాలనక్రిందికి వచ్చింది. పోలీసులు కాశ్మీరీలే గనుక వారిని ప్రభుత్వం ఉపయోగించలేదు. అతిక్రూరమైన పైశాచిక పాలన ప్రారంభమైంది. అప్పటినుంచీ కాశ్మీర్ బయటి ప్రపంచంనుంచి వేరు చేయబడింది. సైనికశాసనం సర్వత్రా అమలు జరుగుతోంది. అనేకసార్లు ప్రజలతో ఘర్షణలు, తుపాకి కాల్పులు జరిగాయి. మరణించినవారి సంఖ్య ప్రభుత్వ ప్రకటనల్లో ఉన్నదానికంటె చాలా హెచ్చు అని నిరూపించడానికి నావద్ద సమాచారం ఉంది...... శ్రీనగర్ ఈరోజున మృతకళేబరాల నగరంగా తయారైంది. నగరవీధుల్లో మసలడమే కష్టంగా ఉంది. అనేకమంది పౌరులు దాదాపు ఎవరియిండ్లలో వారు నిర్బధింపబడ్డారు."

కాశ్మీర్ ప్రజలపై కొనసాగిన యీ కసాయి చర్యలన్నిటినీ నడిపినది బ్రిటిష్ రాజకీయశాఖ. ఆనాడు బ్రిటిష్ప్రభుత్వ ప్రతినిధులతో రాజీ సంప్రతింపులు జరుపుతున్న నెహ్రూ పండితుడు సైతం ఈ విషయాన్ని అంగీకరించారు.

బ్రిటిష్ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అణచివేసేందుకు ఎంత పట్టుదలతో పనిచేసిందంటే, ఇండియానుంచి కూడా తన సైనికుల్ని కాశ్మీర్ పంపడానికి సన్నాహాలు చేసింది. మహారాజా హరిసింగ్ పక్షం వహిస్తున్న 'టైమ్స్ ఆఫ్ కాశ్మీర్' అనే పత్రిక 1946 జూన్ 8వ తేదీని ఈ క్రిందివార్తను ప్రకటించింది :

"రెండు రోజుల్లో ఈ అల్లర్లు అణచివేయబడకపోతే, పరిస్థితులు విషమంగా వున్నట్లయితే, భారతదేశరక్షణకై కొన్ని బెటాలియన్ల బ్రిటిష్ సైనికులు రావల్పిండి నుంచిగాని, సయాల్కోటనుంచి గాని వచ్చియుండేవి."

ఈవిధంగా బ్రిటిష్ ప్రభుత్వం కాశ్మీర్ నిరంకుశ రాచరిక ప్రభుత్వాన్ని కాపాడేందుకు తన సర్వశక్తుల్నీ వినియోగించింది.

సోవియట్ యూనియన్పై దురాక్రమణ జరపడానికి కాశ్మీర్ను ఒక సాధనంగా నిలబెట్టుకోవడం కూడా బ్రిటిష్ పన్నాగంలో ఒక భాగం. ఈ విషయాన్ని ప్రస్తుత కాశ్మీర్ ప్రధాని బక్షి గులాం మహమ్మద్ బయటపెట్టారు. ఆ రోజుల్లో గులాం మహమ్మద్ కాశ్మీర్ బయట రహస్యజీవితం గడిపేవారు. ఆయన అమృతబజార్ పత్రిక విలేఖరితో మాట్లాడుతూ యిలా అన్నట్లు ప్రకటింపబడింది :

"...బ్రిటిష్ ప్రభుత్వం మూడవ ప్రపంచ యుద్ధానికి సన్నాహాలు జరుపుతోంది. సోవియట్ యూనియన్ని తన మొదటి శత్రు దేశంగా అది పరిగణిస్తోంది. కాశ్మీర్ను తన సంపూర్ణ ఆధిపత్యంక్రిందికి తెచ్చుకొని, కాశ్మీర్ - సోవియట్ మధ్య సరిహద్దును పకడ్బందీగా చేసుకోవడమే దాని ఉద్దేశం."

ఇట్టి పరిస్థితుల్లో జవహర్లాల్ నెహ్రూ రాజీ సంప్రతింపులకై 1946 జూన్ మాసంలో కాశ్మీర్ వెళ్ళారు. వెంటనే ఆయనను కాశ్మీర్ ప్రభుత్వం అరెస్టు చేసింది. బ్రిటిష్ ప్రతినిధులు కాంగ్రెసు నాయకులతో రాజీ చేసుకోడానికి సంభాషణలు జరుపుతున్న కాలంలోనే యీ ఘటన జరిగింది. కొద్ది రోజుల్లో భారత ప్రధానిగా అధికారంలోకి రాబోతున్న నెహ్రూ పండితుణ్ణి కాశ్మీర్ ప్రభుత్వం యీ విధంగా సన్మానించినందుకు నెహ్రూ ఆశ్చర్యపడ్డారు. ఈ ఘటన వెనుక బ్రిటిష్ రాజకీయశాఖయొక్క ప్రోత్సాహం ఉన్నదని ఆయన తెలియజేశారు. 1946 జూలై రెండవ వారంలో శ్రీ నెహ్రూ బొంబాయిలోని భారత వాణిజ్య సంఘ సమావేశంలో ఉపన్యసిస్తూ యిలా అన్నారు:

"నిన్న నేను ఢిల్లీలో బ్రిటిష్ మంత్రివర్గ ఉపసంఘంతో సంప్రతింపులు జరుపుతున్నాను. ఈవేళ నన్ను కాశ్మీర్ ప్రభుత్వపు తుపాకులు అడ్డుకున్నాయి. కాశ్మీర్ ఘటనలూ, ఢిల్లీ సంప్రతింపులూ ఏకకాలంలో జరగడం దిగ్భ్రాంతి గొల్పక మానదు. ఈ సందర్భంలో నే నెవరినీ నిందించ దలచుకోలేదు. కాని ఒకటి మాత్రంవాస్తవం. ఇలాంటి ఘటనలు రాజకీయ శాఖయొక్క ప్రోత్సాహం లేనిదే సాధారణంగా జరగవు."

దీన్నిబట్టి తమతో రాజీచేసుకోడానికి కాంగ్రెసు నాయకత్వం సిద్ధంగా వున్నప్పటికీ కాశ్మీర్ రాజుతో కాంగ్రెసు ఒప్పందానికి రావడమంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదులకెంత కంటగింపుగా ఉందో తెలుసుకోవచ్చు.

# 3 వ అధ్యాయం

## దేశ విభజన : కాశ్మీర్ పై దండయాత్ర

కాశ్మీర్ ప్రజలు ఫ్యూడల్ రాచరిక ప్రభుత్వంపై ప్రారంభించిన పోరాటం ముమ్మరంగా కొనసాగుతున్న సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెసుతోను, ముస్లింలీగ్‌తోను రాజీ చేసుకొని భారతదేశాన్ని రెండుగా విభజించింది. పాకిస్తాన్‌లో ముస్లింలీగు, ఇండియన్ యూనియన్‌లో కాంగ్రెసు అధికారంలోకి వచ్చాయి.

ఈ చర్య తీసుకోనేటప్పుడు, బ్రిటన్ తన చెప్పుచేతల్లో వెలగే సంస్థానాల క్రింద సాధ్యమైనన్ని ఎక్కువ ప్రాంతాలు ఉండేటట్లు జాగ్రత్త తీసుకొంది. కొన్ని పెద్ద సంస్థానాలు "స్వతంత్ర" రాజ్యాలుగా ప్రకటించుకొనేటట్లు పన్నాగం పన్నింది. అట్టి సంస్థానాల్లో కాశ్మీర్, హైద్రాబాద్‌లు ముఖ్యమైనవి.

దేశవిభజన తర్వాత బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కాశ్మీర్‌ను రెండు కారణాలవల్ల విడిచిపెట్ట దలచుకోలేదు. మొదటిది, ఇండియా - పాకిస్తాన్‌లమధ్య కలహాలను పెంపొందించడం; రెండవది, సోవియట్ రష్యాపై దురాక్రమణకు సన్నాహాలు జరపడం.

బ్రిటన్ భారతదేశంపై రాజకీయాధికారాన్ని ఒదులుకున్నప్పటికీ, కొత్తగా ఆవిర్భవించిన ఇండియా-పాకిస్తాన్‌ల మధ్య నిరంతరం చిచ్చు రగులుతూఉంటే తాము "మధ్యవర్తిత్వం" నెరపవచ్చుననీ, తద్వారా ఉభయ ప్రభుత్వాలమీద పలుకుబడి సంపాదించవచ్చుననీ — బ్రిటిష్ పాలకులు ఉద్దేశించారు. కాశ్మీర్ ఈ రెండు డొమినియన్లమధ్య ఉంది. అందుచే దాన్ని వారు తమ పన్నాగాలలో పాచికగా ఉపయోగించుకొనదలచారు.

సోవియట్ యూనియన్ పై దురాక్రమణ జరపడానికి కాశ్మీర్‌ను స్థావరంగా చేసుకోవాలనే ఆలోచన ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు చాలకాలం నుంచీ ఉంది. రెండవ ప్రపంచయుద్ధం సమాప్తమైన రోజునుంచీ బ్రిటన్, అమెరికాలు మూడవ ప్రపంచయుద్ధానికి సన్నాహాలు ప్రారంభించాయి. సోవియట్

యూనియన్ చుట్టూ యుద్ధ స్థావరాలను నిర్మించే కార్యక్రమాన్ని చేపట్టాయి. ఈ పథకంలో కాశ్మీర్ కూడా ప్రాధాన్యత వహించింది.

యుద్ధకాలంలో అమెరికా ప్రభుత్వానికి అనేక దేశాల్లోని సైనిక రహస్యాలను తెలియజేస్తూ వేలకొద్దీ చిత్రపటాలను తయారుచేసిన నేషనల్ జాగ్రాఫిక్ సొసైటీ అనే అమెరికన్ సంస్థ కాశ్మీర్‌కి ఉత్తర సరిహద్దున ఎన్నో కీలక స్థలాలను పరిశోధించి, 1946 ఆగస్టులో వెంజెల్ అను ఫొటోగ్రాఫర్‌ని అక్కడికి పంపింది.

"న్యూ యార్క్ టైమ్స్" పత్రిక 1948 జనవరి 25 న యిలా వ్రాసింది: "కాశ్మీర్ ఉత్తర సరిహద్దు ప్రత్యక్షంగా సోవియట్ రష్యాను ఆనుకొని ఉన్నదా అనేదే ప్రశ్న. ఈ ప్రశ్నకు అమెరికన్ నిపుణులు చెప్పే జవాబు, భౌగోళికంగాను, శాస్త్రీయంగాను అది ఆనుకొని లేదని. కాని రాజకీయంగా చూస్తే (సరిహద్దులకు సంబంధించిన ఏ సమస్యనైనా పరిశీలించేటప్పుడు రాజకీయాలనే ప్రాతిపదికగా తీసుకోవాలి) ఈ ప్రశ్నకు ఒకటే జవాబు ఉంది. అది ఏమంటే శాస్త్రీయమైన సరిహద్దు లేకపోయినప్పటికీ అసలు పరిస్థితి మార్పు చెందదు."

"న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్" యిలా వ్రాసింది: "యుద్ధకాలంలోను, యుద్ధం సమాప్తమైన తర్వాత సోవియట్ పరిశ్రమలు ఊరల్ పర్వతాలకూ, ఇంకా దూరప్రాంతాలకూ తరలింపబడ్డం వల్ల, మనం దెబ్బతీయవలసిన ముఖ్య కేంద్రాలన్నీ అక్కడే ఉన్నాయి. ఈ కీలక ప్రాంతాలపై దెబ్బతీయాలంటే మధ్యప్రాచ్యంలోను, ఉత్తర ఆఫ్రికాలోను, బహుశా ఉత్తర భారతదేశంలోను సైనిక స్థావరా లుండాలి."

బ్రిటిష్ ప్రభుత్వం కూడా, యుద్ధం సమాప్తమైన కొత్త రోజుల్లో తన యుద్ధనిపుణుల్ని, సైనిక గూఢచారుల్ని కాశ్మీరుకు పంపింది. కాశ్మీర్ లోయలో బ్రిటిష్ సాయుధబలాలు 1946 లో పెద్దయెత్తున గాలిగుమ్మటాల ట్రెయినింగు పొందాయి. "బొంబాయి క్రానికల్" పత్రిక 1946 జూన్ 14 న యిలా ప్రకటించింది: "కాశ్మీరు నేడు బాంబర్లు మొదలైన యుద్ధవిమానాలకు కేంద్రంగా తయారైంది." ఆగ్నేయాసియా మండలానికి సర్వసైన్యాధిపతిగా వున్న లార్డ్ మౌంట్‌బాటన్, వైమానిక బలాల సర్వాధికారి రిచర్డ్‌పియర్స్ మొదలైనవారు అంతకుముందే యీ ప్రాంతానికి వెళ్లి పరిశీలనలు జరిపారు.

19 వ శతాబ్దంలో బ్రిటిష్ సేనలు జారిస్టు సైన్యాల నెదుర్కొనేందుకు గిల్గిట్ స్థావరాన్ని భద్రపరచుకోవడ మొక ప్రధాన లక్ష్యంగా ఉండేది. కాని 20వ శతాబ్దంలో విమానాలు ఉపయోగంలోకి వచ్చాయి. గిల్గిట్ కొండలోయలు, పర్వతశ్రేణులు పెద్ద పెద్ద విమానాశ్రయాల నిర్మాణానికి అడ్డువచ్చాయి. ఇరుకైన కొండలోయల్లో విమానాలు స్వేచ్ఛగా విన్యాసాలు చేయడంగాని, రాకపోకలు సాగించడంగాని దుర్లభమైంది. అందుచేత, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు యితర ప్రాంతాలకోసం అన్వేషణలు ప్రారంభించారు. వారిదృష్టి

కాశ్మీరులోయ' అనే విశాలమయిన ప్రదేశంమీద పడింది. ఇక్కడ పర్వత శ్రేణులు, కొండలోయలు లేవు. విశాలమైన మైదానాలు అనేకం వున్నాయి. విమానాశ్రయాల నిర్మాణానికి అవి అన్నివిధాలా అనుకూలంగా వున్నాయి. అంతేగాక, 'కాశ్మీర్‌లోయ' గిల్గిట్‌కి బలమైన పూర్వాంగంగా ఉపయోగ పడుతుంది. పర్వతశ్రేణుల్లో వున్న గిల్గిట్‌ని రక్షించుకోవాలంటే 'కాశ్మీర్ లోయ' వారికి అవసరమైంది. ఈ కారణాలన్నిటివల్ల, అమెరికన్ సాయుధ బలాల సర్వసైన్యాధ్యక్షుడవ్వడం 1950 లో అమెరికా అధ్యక్షునికొక మెమొరాండం పంపుతూ, 'కాశ్మీర్‌లోయ'లో విస్తారంగా విమానాశ్రయాలను నిర్మించవలసిన అవసరాన్ని తెలియ జేశారు.

ఈ విధంగా, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల యుద్ధ సన్నాహాలలో కాశ్మీర్ కీలక స్థాన మాక్రమించింది ఇందుకు వారు స్వ్యాడల్ రాచరిక ప్రభుత్వాన్ని సర్వవిధాలా రక్షించదలచారు. కాశ్మీర్ ఇండియన్ యూనియన్‌లోగాని, పాకిస్తాన్‌లోగాని చేరకుండా ఉండడం మంచిదని వారు సలహా యిచ్చారు. ఇందుకు కాశ్మీర్ మహారాజా అంగీకరించాడు. 1947 అక్టోబరు 26 న అతడు లార్డ్ మౌంట్ బాటన్‌కి వ్రాసిన జాబులో యీ విషయం తెలియజేశాడు.

కాని క్రమేణా పరిస్థితులిందుకు వ్యతిరేకంగా పరిణమించాయి.

మొదటి విషయం, కాశ్మీర్ ఇండియన్ యూనియన్‌లో చేరాలని భారత ప్రభుత్వం పట్టు పట్టింది.

రెండవది, "క్విట్ కాశ్మీర్" ఉద్యమాన్ని అణచేందుకు ప్రభుత్వమెంత క్రూరమైన పద్ధతు లవలంబించినప్పటికీ, ప్రజా వెల్లువ విజృంభిం మతూ వచ్చిందే కాని అణగిపోలేదు.

అంతేగాక, కాశ్మీర్‌కు పొరుగునవున్న పంజాబులో హిందూ-ముస్లిం కలహాలు తీవ్రరూపం దాల్చుతున్నప్పుడు జాతీయ మహాసభ నాయకుల్ని విడుదల చేయాలనే నినాదం కాశ్మీర్ అంతటా ప్రతిధ్వనించింది. జాతీయమహాసభ కార్యకర్తలు మతకలహాలకు వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరిస్తున్నకొద్దీ హిందువుల్లో ఒక నూతన దృక్పథం అలవడింది. అంతవరకూ ప్రజాతంత్ర ఉద్యమానికి దూరంగా వున్న కాశ్మీర్ పండితులు, డోగ్రాలు, సిక్కులు జాతీయనాయకుల్ని విడుదల చేయాలనీ, నిర్బంధవిధానాన్ని ఆపుజేయవలసిందనీ డిమాండుచేయ నారంభించారు.

మహారాజును బలపరిచే భూస్వామ్యశక్తులమధ్య పూర్వం ఉండే ఐక్యత ఇప్పుడు సడలింది. వారిలో పలుకుబడిగల ముఖ్యు లనేకమంది, "స్వతంత్ర కాశ్మీర్" విధానాన్ని వ్యతిరేకించ నారంభించారు. భూస్వామ్యవ్యవస్థ ప్రజా వెల్లువముందు తుడిచిపెట్టుకుపోయే ప్రమాదం కంటె కాశ్మీర్ భారతదేశంలో సంలీనం కావడమే మంచిదని వీరు అభిప్రాయపడ్డారు. ఈ భావం రాజభవనంలో సహితం వ్యక్తం కాజొచ్చింది. మహారాజు కుటుంబీకుల్లో చాలమంది అతని విధానాన్ని వ్యతిరేకించారు.

ఈ కారణాలన్నిటివల్ల, మహారాజా హరిసింగ్ పరిస్థితి రుడితిలాపక్ష ఎటుక చారదయుంది. కేవలం సైనికబలంతోనే కాశ్మీర్ ప్రజల్ని లొంగదీసు కోడం కలలోనివార్త అని అతడు గ్రహించాడు. "స్వతంత్ర కాశ్మీర్" నినాదం ఎంతో కాలం నిలవదని తెలుసుకున్నాడు. ఇతర మార్గాలకోసం వెతక నారంభించాడు.

ఈలోగా కాంగ్రెసు నాయకులు మహారాజుని యెలాగైనా ఇండియన్ యూనియన్‌లో చేరేటట్లు ఒప్పించడానికి ఎడతెగకుండా కృషిచేశారు. మహారాజుకూడా, యితర సంస్థానాధీశులు ఇండియన్ యూనియన్‌లో కలవడం వల్ల పెద్దగా నష్టపడలేదని గ్రహించాడు. సంస్థానాధీశులపై ప్రజలు జరిపే పోరాటాలను కాంగ్రెసు నాయకులు ప్రోత్సహించరని అతనికి తెలుసు. అందుచేత అతడు కాంగ్రెసు నాయకత్వంతో బ్రతుకుజీవుడా అని రాజీపడ్డానికి ఆలోచిస్తున్నాడు.

ఇట్టి పరిస్థితుల్లో గాంధీజీ 1947 ఆగస్టు మాసంలో శ్రీనగర్ వెళ్ళారు. అదివరకే రాజీపడాలను కొంటున్న మహారాజు కాంగ్రెసు నాయకత్వంతో ఒప్పందం కుదుర్చుకోడానికి అంగీకరించాడు. గాంధీజీ ఆగస్టు 6 వ తేదీని సర్దార్ పటేల్‌కి వ్రాసిన ఉత్తరంలో యిలా తెలియజేశారు :

"నేను మహారాజుతోను, మహారాణితోను గంటసేపు సంభాషణలుజరిపాను. అతడు తన ప్రజల్ని అనుసరించడానికి ఒప్పుకున్నాడు. కాని అసలు విషయాని కతడు రాలేదు. మొదట ప్రధాని కాక్‌ని అధికారం నుంచి తొలగించాలని అతని అభిప్రాయం. కాని ఎలా తొలగించాలో తెలియక సతమతమవుతున్నాడు. కాక్ స్థానంలో సర్ జయలాల్‌ని నియమించడానికి ఇంచుమించు నిర్ణయమయింది. ఆ విషయమై మీరు కొంచెం పట్టించుకోవలసి యుంటుంది. నా అభిప్రాయం ప్రకారం కాశ్మీర్ పరిస్థితిని చక్కదిద్దవచ్చు."

కాక్ ప్రధానిగా వున్నంతకాలం మహారాజు తన అభీష్టాన్ని కార్యరూపంలో పెట్టడం సాధ్యంకాదని తెలుసుకొని, ఆగస్టు 11 వ తేదీని — అనగా గాంధీజీతో సంప్రతింపులు జరిపిన 8 రోజుల తర్వాత — అతన్ని బర్తరఫు చేశాడు.

ఈ చర్య ప్రజాశక్తుల కొక విజయంగా పరిగణింపబడింది. జాతీయ మహాసభ నాయకులపై విధింపబడిన ఆంక్షలు రద్దుచేయబడ్డాయి. షేక్ అబ్దుల్లాను శ్రీనగర్ జైలుకు మార్పించి, ఆయనతో మహారాజు ప్రతినిధులు సంప్రదింపులు ప్రారంభించారు. "క్విట్ కాశ్మీర్" నినాదాన్ని వదులుకొని బాధ్యతాయుత ప్రభుత్వాని కంగీకరిస్తే, జాతీయ మహాసభ నాయకుల్ని తన మంత్రివర్గంలోకి తీసుకుంటానని మహారాజు సూచించాడు. కొన్ని రోజులతర్వాత అబ్దుల్లా విడుదలచేయబడ్డారు. నిర్బంధవిధానం సడలింపబడింది. 1947 అక్టోబరు మాసంలో నూతన ప్రధాని

పత్రికావిలేఖరులతో ప్రసంగిస్తూ, కాశ్మీర్ మహారాజు తన అధికారాన్ని ప్రజా ప్రతినిధులకు వొప్పజెప్పేందుకు సిద్ధంగా ఉన్నాడనీ, అయితే రాజమర్యాదలూ, కొన్ని సౌకర్యాలూ మాత్రం అవసరమవుతాయనీ తెలియజేశాడు.

ఈ వ్యవహారమంతా బ్రిటిష్ పాలకుల వంటికి కారం రాసినట్లయింది. కాశ్మీర్ మహారాజు మొదట కాంగ్రెసుతోను, తర్వాత జాతీయ మహాసభతోను రాజీచేసుకొని, జాతీయ నాయకులకు అధికారమంతా వొప్పజెబితే, కాశ్మీర్‌పై తాముపెట్టుకున్న ఆశలన్నీ అడియాసలవుతాయని వారు భయపడ్డారు. కొన్నాళ్ళ తర్వాత కాశ్మీర్ ఇండియన్ యూనియన్‌లో సంలీనం కాకమానదని గాబరా పడ్డారు. అప్పుడు తమ "స్వతంత్ర కాశ్మీర్" స్వప్నం భగ్నమవుతుందని హడలెత్తారు. కాశ్మీర్ ఇండియన్ యూనియన్‌లో చేరితే, రష్యాపై దురాక్రమణకు కాశ్మీర్‌ను స్థావరంగా చేసుకోవాలనే తమప్లాను భగ్నమవుతుందని వారెరుగుదురు. ఇందుకు కారణం భారతదేశంలో ప్రజాతంత్ర ఉద్యమం ఎలియమైన శక్తిగా పెంపొందుతూండడమే. అందుచేత బ్రిటిషు సామ్రాజ్యవాదులు తమ ముందు మూడు కర్తవ్యాలుంచుకున్నారు.

1. కాశ్మీర్ జాతీయోద్యమాన్ని నాశనంచేయడం.

2. కాశ్మీర్ ప్రభుత్వంలో తమ అడుగులకు మడుగులొత్తే వారిని కూర్చోబెట్టి, తమ యుద్ధపథకాలన్నిటినీ అమలుజరపడం.

3. కాశ్మీర్ ఇండియన్‌యూనియన్‌లో చేరకుండాచేయడం.

ఈ మూడు లక్ష్యాలను సాధించడంకోసమే బ్రిటిష్ రక్కసులు కాశ్మీర్‌పై సాయుధ దండయాత్రకు ప్లాను తయారుచేశారు. జాతీయోద్యమానికి కేంద్రమైన 'కాశ్మీర్‌లోయ'ను కైవశంచేసుకొని, దాన్ని పెద్ద సైనిక స్థావరంగా చేసుకోవడమే వారి పరమావధి.

కాశ్మీర్‌పై పెద్ద యెత్తున దండయాత్ర జరపడానికి సన్నాహాలు 1947 సెప్టెంబరులో ప్రారంభమయాయి. పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్ర గవర్నరు సర్. జార్జి కన్నింగ్‌హాం, ఖాన్‌బహదూర్ కులీఖాన్ మొదలైనవారు సరిహద్దు కొండజాతి ప్రజల్ని - ముఖ్యంగా మసూద్‌లను, ఆఫ్రిడీలను, షిన్వారీలను, వజీర్లను - సాయుధదాడులలో పాల్గొనేందుకు రిక్రూట్ చేయడం ప్రారంభించారు. బ్రిటిష్ ప్రోత్సాహంతో పాకిస్తాన్ ప్రభుత్వం వీరందరికీ ఆయుధాలను సప్లయిచేసింది. బ్రెన్‌గన్స్, స్టెన్‌గన్స్, గ్రెనేడ్లు, మరఫిరంగులు, టాంకు విధ్వంసక రైఫిల్సు, మందుపాతరలు మొదలైన ఆధునిక ఆయుధాలెన్నో వారికీయబడ్డాయి. పాకిస్తాన్ మిలిటరీ ఎకాడమీకి బ్రిటిష్ సైన్యాధికారిగావున్న కర్నల్ ఇంగాల్ వీరికి తరిఫీదు యివ్వడం ప్రారంభించాడు.

సెప్టెంబరు 3 వ తేదీని - అంటే ప్రధాని కాక్ బర్తరఫ్ చేయబడ్డ 23 రోజుల తర్వాత - మొట్టమొదటి సరిహద్దు సంఘర్షణ జమ్మూ నగరానికి

ఆగ్నేయంగా 17 మైళ్ళ దూరంలో జరిగింది. సెప్టెంబరు నెలాఖరుకి దాడుల సంఖ్య పెరిగింది. పశ్చిమ పంజాబుకు ఆనుకొనివున్న జమ్మూరాష్ట్ర సరిహద్దుపై ఏకకాలంలో అనేక దాడులు జరిగాయి. అందువల్ల కాశ్మీర్ ప్రభుత్వం తన సేనల్ని దూరంగాపంపివేయవలసి వచ్చింది. ఫలితం ఏమయిందంటే కాశ్మీర్ సేనలు చిన్నచిన్న చక్రబంధాల్లో యిరుక్కుపోయాయి. ఈ సంఘర్షణలు జమ్మూరాష్ట్ర సరిహద్దు పొడుగునా జరగడంవల్ల, అక్కడికి దూరంగావున్న 'కాశ్మీరులోయ'ను రక్షించడానికి ప్రభుత్వసేనలు తగినన్ని లేకపోయాయి. ఇలా జరుగుతుందని దురాక్రమణ దారులకు ముందే తెలుసు. అందుచేత, కాశ్మీర్‌కు ముఖ్యపట్టణమైన శ్రీనగర్ - డొమెల్ రోడ్డుమీద పెద్దయెత్తున దాడులు జరిపితే వాటిని ప్రభుత్వ సేనలు ప్రతిఘటించలేక పోతాయని వారి అంచనా. ఆ విధంగా శ్రీనగర్‌ని అకస్మాత్తుగా ముట్టడించ వచ్చునని వారు ప్లాను వేసుకున్నారు.

ఈ వ్యూహం, అనుకున్న ఫలితాలనే యిచ్చింది. కాశ్మీర్ ప్రభుత్వం యింత ప్రమాదంలో పడినప్పటికీ, ప్రజల సహకారంతో దురాక్రమణ దారుల్ని యెదుర్కోవాలనే ఆలోచన దానికి లేకపోయింది.

అక్టోబరు 20 న వేలాది శత్రుమూకలు ముజఫరాబాద్‌వద్ద పెద్ద యెత్తున దాడి చేశాయి. శ్రీనగర్ - డోమెల్ రోడ్డుమీదుగా పురోగమించాయి. డొమెల్, యూరి, బరాముల్లా, పట్టన్ అనే కేంద్రాలను వశపరచుకొని, అక్కడి యిండ్లన్నిటినీ భస్మీపటలం చేశారు. ఆస్తులను లూటీ చేశారు. వందలాది ప్రజల్ని చిత్రవధ చేసి చంపారు. ఆ తర్వాత శ్రీనగర్‌పై దాడి చేయడానికి ముందుకు తోసుకువెళ్ళారు.

రాజధానీ నగరం ఇక రెండు రోజుల్లో శత్రువుల చేతుల్లో పడేటట్లుంది.

ఈ ఒత్తిడికి కాశ్మీర్ మహారాజు తట్టుకోలేకపోయాడు. పరిపాలానా యంత్రం ఛిన్నాభిన్నమయింది. భూస్వామ్య వర్గాలు గందరగోళంలో పడ్డాయి. ఉన్నతాధికారులు గడగడ వణకనారంభించారు. మహారాజా హరిసింగ్ హడలెత్తి సపరివారంగా శ్రీనగర్‌ను విడిచి పారిపోయాడు.

1947 అక్టోబరు 26 న కాశ్మీర్ భారతదేశంలో చేరుతున్నట్లు మహారాజా ప్రకటించాడు. ఆదేసమయంలో కాశ్మీర్ జాతీయ మహాసభ అధ్యక్షుడైన షేక్ అబ్దుల్లాను తాత్కాలిక ప్రభుత్వాన్ని నిర్మించవలసిందని అతడు ఆహ్వానించాడు. తర్వాత తాత్కాలిక ప్రభుత్వం సంపూర్ణాధికారాలుగల మంత్రివర్గంగా అధికారం స్వీకరించింది. దానికి షేక్ అబ్దుల్లా ప్రధాని. మహారాజా హరిసింగ్ 1949 జూన్‌లో తన కుమారుడైన యువరాజా కరణ్‌సింగ్‌ని మహారాజుగా నియమించాడు.

కాని శ్రీనగర్ ప్రజలు తమ ప్రాణాలకన్న దేశం ఎక్కువ అని భావించారు. వెంటనే వారు, అస్తవ్యస్తంగాఉన్న పరిపాలనా యంత్రాన్ని పటిష్ట మొనర్చడం ప్రారంభించారు. వలంటీర్ దళాలుగా ఏర్పడి, రాజధానిని

రక్షించే బాధ్యతను తీసుకున్నారు. జాతీయ మహాసభ కార్మికుల్నీ, విద్యార్థుల్నీ, యువకుల్నీ, దేశాభిమానంగల విద్యావంతుల్నీ సమీకరించి, పరిపాలనా యంత్రాన్ని హస్తగతం చేసుకుంది. పౌరసంఘాలను నెలకొల్పింది. కీలక ప్రాంతాల రక్షణకై సాయుధ వలంటీర్ దళాలను నిర్మించింది. మహారాజా ఏజంట్లను, కాక్ ప్రధాని అనుచరుల్ని, ముస్లింలీగ్ కార్యకర్తలను అరెస్టుచేసి, కఠిన శిక్షలు విధించింది. యువకులతో కూడిన ఒక సాయుధ ప్రజాసేన ఉద్భవించింది.

ఈ విధంగా, అబ్దుల్లా నాయకత్వంక్రింద జాతీయ మహాసభ ఒక వైపు శ్రీనగర్ రక్షణకు ప్రజానీకాన్ని సమీకరిస్తూనే, మరో వైపు భారతప్రభుత్వాన్ని సైనిక సహాయం పంపమని అభ్యర్థించింది.

దీనితో బ్రిటిషు సామ్రాజ్యవాదులు గంగవెర్రు లెత్తారు. శ్రీనగర్ రక్షణకు భారతప్రభుత్వం తనసేనను పంపినట్లయితే, కొండజాతులవారు తిరోముఖం పట్టవలసివస్తుందనీ, తత్ఫలితంగా 'కాశ్మీర్‌లోయ'ను హస్తగతం చేసుకోవాలనే తమ ప్లాను తలక్రిందులవుతుందనీ వారు భయపడ్డారు. అందుచేత లార్డ్ మౌంట్ బాటన్ (వైస్రాయి) జాతీయమహాసభ కోర్కెను వ్యతిరేకించాడు. కాని ఇండియా ప్రభుత్వం అంగీకరించింది.

అక్టోబరు 27 న భారతసేనలు శ్రీనగర్ ప్రవేశించాయి. సాయుధవలంటీర్ల సహాయంతో దురాక్రమణ దారుల్ని బరాములానుంచి, యూరీనుంచి తరిమివేశాయి. ఈ విధంగా 'కాశ్మీర్‌లోయ' రక్షింపబడింది.

కాని, ఉత్తర, పశ్చిమోత్తర, ఈశాన్యదిశల్లో గణనీయమైన భూభాగం దురాక్రమణ దారుల చేతుల్లోపడింది. అక్కడ "ఆజాద్ కాశ్మీర్" పేరుతో ఒక ప్రభుత్వం స్థాపింపబడింది. గిల్గిట్ కూడా ఈ ప్రాంతంలో చేరివుంది. ఇక్కడ "తిరుగుబాటు"కు నాయకత్వం వహించినది మేజర్ బ్రౌన్ అను బ్రిటిష్ సైన్యాధికారి.

బ్రిటిష్ అధికారులు, పాకిస్తాన్ సేనలను నడిపే ఉన్నత బ్రిటిష్ ఉద్యోగులు ఒక ప్లానుప్రకారం కాశ్మీర్‌పై ఈదాడిని ఆర్గనైజ్ చేశారనే విషయం నిర్వివాదం. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ఈ దండయాత్రను "విమోచనోద్యమం"గా చిత్రించారు. దురాక్రమణదారులు "స్వాతంత్ర్యయోధు"లని డెయిలీ టెలిగ్రాఫ్, డెయిలీ మెయిల్ మొదలైన బ్రిటిష్ పత్రికలు, న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ మొదలైన అమెరికన్ పత్రికలు కొనియాడుతూ వార్తలు - వ్యాసాలు ప్రకటించాయి.

## 4 వ అధ్యాయం

# ఐక్యరాజ్య సమితిలో ఫిర్యాదు : సామ్రాజ్యవాదుల కుట్ర

బ్రిటిష్ పాలకులు దండయాత్రద్వారా కాశ్మీర్‌ను కాజేయాలని చేసిన ప్రయత్నం భగ్నమవడంతో, కొత్త పన్నాగం పన్నారు. దీనికి వైస్రాయి మౌంట్ బాటన్ సారథ్యం వహించాడు. కాశ్మీర్ సమస్యపై ఐక్యరాజ్య సమితిలో ఫిర్యాదు చేయవలసిందని అతడు ఇండియా ప్రధానికి సలహాయిచ్చాడు. ఐక్యరాజ్యసమితిలో మెజారిటీ ఆంగ్లో - అమెరికన్ కూటమిదేగనుక, కాశ్మీర్ వ్యవహారాల్లో తాము జోక్యం కల్పించుకోవచ్చుననీ, తద్వారా యీ కీలక ప్రాంతాన్ని తమ పెత్తనం క్రింద ఉంచుకో వచ్చుననీ బ్రిటన్, అమెరికాలు భావించాయి.

మౌంట్ బాటన్ ఉభయ ప్రభుత్వాలమధ్య 'శాంతిదూత' వలె నాటకమాడాడు. దాడి మూకలను యూరీకి దూరంగా తరిమివేయడానికి భారతసైన్యం పూనుకుంటే ఇండియా - పాకిస్తాన్‌ల మధ్య యుద్ధం ప్రారంభమయే ప్రమాదం వున్నదంటూ అతడు భారత ప్రభుత్వాన్ని హెచ్చరించాడు. కాశ్మీర్‌లో కొంతభాగం దాడి మూకల ఆక్రమణక్రింద వుంటే, దాన్ని అవకాశంగా తీసుకొని భారత ప్రభుత్వంపై సైనిక ఒత్తిడి తీసుకరావచ్చుననీ, తద్వారా తమ "మధ్యవర్తిత్వాన్ని" అంగీకరింపజేయ వచ్చుననీ - మౌంట్ బాటన్ ఈ యుక్తిపన్నాడు.

ఈ విధంగా అతడు కాశ్మీర్ సమస్యపై ఐక్యరాజ్యసమితి జోక్యానికి మార్గం సుగమం చేశాడు. భారత ప్రభుత్వం ఈ పన్నాగానికి లొంగి, మౌంట్ బాటన్ సలహాను స్వీకరించింది. **1947** డిసెంబరు **31** న భద్రతాసమితికి పాకిస్తాన్ పై ఫిర్యాదు పత్రం పంపింది.

ఇది సామ్రాజ్యవాదుల కొక విజయం. బ్రిటన్ - అమెరికా ప్రభుత్వాలు ఇండియా - పాకిస్తాన్‌ల మధ్య ద్వేషానలం రెచ్చగొట్టి, కాశ్మీర్ ప్రజల్ని సందిగ్ధా

వక్షంలో పెట్టి, "మధ్యవర్తిత్వం" పేరుతో పెత్తనం చేయడానికి ఈ పర అవకాశమిచ్చింది.

భారతప్రభుత్వం పంపిన ఫిర్యాదుపత్రంలో 4 అంశాలున్నాయి :

1. దాడిమూకలు పాకిస్తాన్ భూభాగంమీదుగా రాకపోకలు జరపడానికి అనుమతి యివ్వబడింది.

2. వారు పాకిస్తాన్ భూభాగాన్ని స్థావరంగా చేసుకొని దండయాత్ర జరపడానికి అనుమతింపబడింది.

3. దాడి మూకలకు సైనిక పరికరాలు, రవాణా సామగ్రి, పెట్రోలు వగైరా పాకిస్తాన్‌నుంచి లభించాయి.

4. పాకిస్తాన్ అధికారులు వీరికి ట్రెయినింగ్ యిచ్చి, ప్రత్యక్షంగా సహాయం చేశారు.

1948 జనవరి 15న భద్రతా సమితి సమావేశంలో భారతప్రతినిధి శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ చర్చను ప్రారంభిస్తూ, కాశ్మీర్ సమస్యను యీ క్రింది మాటల్లో క్లుప్తంగా వివరించారు:

"మేమొక స్పష్టమైన, సూటియైన సమస్యను సమితి ముందుంచాం. దాడిమూకలను కాశ్మీర్ భూభాగంనుంచి వెనక్కు రప్పించి, అక్కడనుంచి వారిని వెళ్లగొట్టి, వెంటనే దాడులను విరమింపజేయాలి. ఇదొక్కటే మేము కోరేది."

కాని, భద్రతాసమితిలో మెజారిటీగల ఆంగ్లో - అమెరికన్ కూటమి యీ స్పష్టమైన కోర్కెను వక్రంగా చిత్రించింది. జనవరి 17 న వారొక తీర్మానం చేస్తూ, దాడిమూకల్నీ దాడికి గురైనవారినీ ఒకేగాటన కట్టారు. భారతప్రభుత్వా, పాకిస్తాన్ ప్రభుత్వం కూడా "పరిస్థితిని విషమింపజేసే ఎట్టి చర్యలకు" దిగవద్దని కోరారు.

ఈ వాదనను సోవియట్ ప్రతినిధి గ్రోమికో వ్యతిరేకించారు. ఆయన ఇలా చెప్పారు :

"ఈ కొత్తసూచన యిప్పుడున్న పరిస్థితుల్లో ఎట్టిమార్పూ తీసుకురాదు. అసలువిషయాన్ని తెలియజేసే తీర్మానం ఒకటి అవసరం. ఉభయ ప్రభుత్వాల మధ్య సత్సంబంధాలు నెలకొనేందుకు సహాయం చేసేవిధంగా ఆ తీర్మానం ఉండాలి."

తర్వాత, భద్రతాసమితి అధ్యక్షునితో యీ సమస్యను చర్చించవలసిందని ఆంగ్లో - అమెరికన్ మెజారిటీ భారత - పాకిస్తాన్ ప్రతినిధుల్ని కోరగా, వారలాచేశారు. అతడొక "పరిష్కార మార్గం" సూచించాడు. "తటస్థరాజ్యాలతో కూడిన ఒక నిష్పాక్షిక పాలన" క్రింద కాశ్మీర్‌లో జనవాక్య సేకరణ జరపవలసిందని అతడు సలహాయిచ్చాడు.

దాన్ని భారత ప్రతినిధి నిరాకరించాడు.

తర్వాత భద్రతా సమితి అధ్యక్షుడొక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. దాని ప్రకారం, ముగ్గురు సభ్యులతో ఒక ఐ.రా.స. ఉపసంఘం నియమింపబడుతుంది. ఆ ముగ్గురూ ఆంగ్లో - అమెరికన్ కూటమికి చెందినవారే. భద్రతాసమితికి ప్రాతినిధ్యం వహించని ఈ సూచనను రష్యా ప్రతినిధి వ్యతిరేకిస్తూ, భద్రతా సమితి సభ్యుల్నే (వారు ముగ్గురుగాని, ఐదుగురుగాని, మొత్తం 11 గురూగాని) నియమించాలని ప్రతిపాదించాడు. కాని అది వీగిపోయింది.

భారత ప్రతినిధివర్గం ఆంగ్లో- అమెరికన్ కూటమి తీర్మానాన్ని అంగీకరించింది.

కాని, జనవరి 29 సమావేశంలో భద్రతాసమితి అధ్యక్షుడు ప్రతిపాదించిన రెండు తీర్మానాలూ, వాటిని బలపరుస్తూ బ్రిటిష్-అమెరికన్ ప్రతినిధులు చేసిన ప్రసంగాలూ విన్న తర్వాత, భారత ప్రతినిధి సామ్రాజ్యవాదుల ఉద్దేశాన్ని గ్రహించాడు.

మొదటి తీర్మానం ప్రకారం, "కాశ్మీర్ భవిష్యత్తు జనవాక్య సేకరణ ద్వారా నిర్ణయింపబడుతుంది. ఈ జనవాక్య సేకరణ నిష్పాక్షికంగా జరిగేటందుకు అంతర్జాతీయ కంట్రోలు అమలుజరుగుతుంది." రెండవ తీర్మానం ప్రకారం, ఐక్యరాజ్యసమితి ఉపసంఘం కాశ్మీర్‌లో "శత్రుచర్యలు, దౌర్జన్యం అపుచేయుండే విధంగా, అతి త్వరితంగా" చర్యలు తీసుకోవాలి.

దీని అర్థం, "అంతర్జాతీయ కంట్రోలు" పేరుతో ఆంగ్లో - అమెరికన్ మెజారిటీ తన ప్రయోజనాల కనుగుణ్యంగా "అతిత్వరితంగా" జనవాక్య సేకరణకు చర్యలు తీసుకోవలసిందని ఐ. రా. స. ఉపసంఘాన్ని ఆదేశించిందన్నమాట.

ఈ రెండు తీర్మానాలను బలపరుస్తూ, బ్రిటన్ - అమెరికాల ప్రతినిధులు వాస్తవ పరిస్థితిని వక్రంగా చిత్రించి, అబద్ధారోపణలు చేశారు. బ్రిటిష్ ప్రతినిధి నోయెల్ బేకర్, అమెరికా ప్రతినిధి వారన్ ఆస్టిన్ తమ ఉపన్యాసాల్లో దాడిమూకల చర్యను పూర్తిగా సమర్థించారు. కాశ్మీర్‌లో ముస్లిం ప్రజలు మహారాజా నిరంకుశత్వం క్రింద యమబాధలు అనుభవిస్తున్నారని ఆందోళన చెందడంవల్లనే కొండజాతులవారు దురాక్రమణ జరిపారనీ, కాశ్మీర్ ముస్లింల భవిష్యత్తు "న్యాయమైన," "నిష్పాక్షికమైన" జనవాక్య సేకరణ ద్వారా నిర్ణయింపబడుతుందనే హామీ ఉన్నప్పుడే వారిని వెనక్కు తగ్గమని చెప్పడం సాధ్యమనీ వారు వాదించారు.

అంటే, బ్రిటన్, అమెరికాలు తమ ఆధిపత్యం క్రింద "తటస్థ" రాజ్యాల కంట్రోలు అనే పేరుతో తమ సొంత పరిపాలనాయంత్రాన్ని కాశ్మీర్‌లో సృష్టించ దలచుకొన్నాయన్నమాట.

ఈ రెండుతీర్మానాలను శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ వ్యతిరేకించారు.

భద్రతాసమితి నుంచి భారత ప్రభుత్వం కోరింది రక్షణ; కాని భద్రతా సమితి యివ్వదలచుకున్నది భక్షణ! భారత ప్రభుత్వం పై పథకాన్ని అంగీకరించి యుంటే, కాశ్మీర్‌లో పరిపాలనాధికారం అబ్దుల్లా ప్రభుత్వానికి గాక, ఆంగ్లో-అమెరికన్ కూటమికి లభించియుండేది.

మార్చి 18 న భద్రతాసమితి మళ్లీ సమావేశమైంది. ఈసారి కొమింటాంగ్ ప్రతినిధి ఒక కొత్త తీర్మానాన్ని ప్రతిపాదించాడు. కాశ్మీర్ ప్రభుత్వం యొక్క అధికారాలను రద్దుచేసే విధంగా ప్లెబిసైట్ అధికారులు వ్యవహరించరాదని అర్థం వచ్చేటట్లు కొన్నిమాటలను అందులో చేర్చాడు. కాని, అవి వాస్తవాన్ని మరుగు పరిచేందుకే ఉద్దేశింపబడ్డాయి. ఈ విషయాన్ని శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ గమనించలేక, కొమింటాంగ్ ప్రతినిధి తీర్మానాన్ని కొనియాడాడు. కాని సామ్రాజ్యవాద కూటమి తీర్మానం చూచిన తర్వాత, తన తప్పు తెలుసుకున్నాడు.

ఈ కొత్త తీర్మానంలో ప్లెబిసైట్ నిర్వహణాధికారుల హక్కులు వివరింప బడ్డాయి. భారత ప్రభుత్వం యొక్క విధులుకూడా నిర్వచింపబడ్డాయి.

ఉదాహరణకు ప్లెబిసైట్ నిర్వహణాధికారులు కోరే అధికారాలను కాశ్మీర్ ప్రభుత్వం వారికి దఖలుపరిచేటట్లు ఇండియా ప్రభుత్వం చూడాలి. సైన్యంమీద, పోలీసు దళాలమీద కూడా వారుకోరే అధికారాలివ్వాలి. అంతే గాదు. ప్లెబిసైట్ అధికారులు సిఫార్సుచేసిన వారినే కాశ్మీర్ ప్రభుత్వం స్పెషల్ మేజిస్ట్రేట్లుగా నియమించాలి. వారు జనవాక్య సేకరణకు సంబంధించిన ఫిర్యాదు లన్నిటినీ విచారించి తీర్పుచెబుతారు.

జైళ్ళలో నిర్బంధింపబడిన రాజకీయ ఖైదీలందరినీ (వీరంతా పాక్ ప్రధాని ఏజంట్లు, ప్రజాస్వామ్య పాలనను వ్యతిరేకించిన మత దురహంకారులు) విడుదల చేయాలనికూడా తీర్మానంలో పేర్కొనబడింది. ఐ. రా. స. ఉపసంఘంలో ముగ్గురుగాక ఐదుగురు సభ్యులుండాలని మరొక క్లాజులో ఉంది. (అమెరికా, అర్జంటీనా, కొలంబియా, బెల్జియం, జెకోస్లావేకియా).

ఈ తీర్మానాన్ని చూచి భారతప్రతినిధి మండిపడ్డాడు. దాన్ని వ్యతిరేకించ వలసిందని భారతప్రభుత్వం ఉత్తర్వులు పంపింది. తదనుగుణ్యంగా శ్రీ గోపాల స్వామి అయ్యంగార్ భద్రతాసమితి తీర్మానాన్ని వ్యతిరేకించారు. అయినా, తీర్మానం 1948 ఏప్రిల్ 21 న మెజారిటీ సభ్యులచే ఆమోదింపబడింది.

ఈ చర్యను కాశ్మీర్ ప్రజలొక సవాలుగా తీసుకున్నారు. జాతీయ మహా సభ జనరల్ కౌన్సిల్ సమావేశమై, కాశ్మీర్ వ్యవహారాల్లో విదేశీయులు జోక్యం కల్పించుకోడాన్ని తాము సహించబోమని తీర్మానించింది. కాశ్మీర్ రక్షణకై ప్రజాప్రభుత్వం ప్రజలకు ఆయుధాలివ్వవలసిందని కోరింది.

భద్రతాసమితి తీర్మానాన్ని భారత ప్రభుత్వం వ్యతిరేకించి నప్పటికీ, మౌంట్ బాటన్ ఒత్తిడిఫలితంగా ఐ. రా. స. ఉపసంఘంతో సంప్రతింపులు

జరపడానికి అంగీకరించింది. కాశ్మీర్ జాతీయ మహాసభ జరపదలుచుకున్న వ్యతిరేక ప్రదర్శనలను ఆపుజేయవలసిందని సలహా యిచ్చింది. తదనుగుణ్యంగా అవి ఆపు జేయబడ్డాయి.

ఏప్రిల్ 21 న - అనగా భద్రతాసమితి తీర్మానం మెజారిటీ ఓటులో అమోదింపబడిన రోజున - భారత ప్రభుత్వం రాజౌరీ, ముజఫరాబాద్ పట్టణాలను విముక్తి చేయడానికి తన సేనలను అక్కడికి పంపింది. భారత సేనలు రాజౌరీ ప్రవేశించాయి. ముజఫరాబాద్‌ను ముట్టడించడానికి సిద్ధంగా వున్నాయి. వెంటనే సామ్రాజ్యవాదులు ప్రతిఘటనకు పూనుకున్నారు. పాకిస్తాన్ సర్వ సైన్యాధికారి జనరల్ గ్రేసీ పాక్ సేనలను కాశ్మీర్‌కు పంపించాడు. ఇంతవరకు పాకిస్తాన్ ప్రభుత్వం దాడిమూకలకు ఆయుధాలను మాత్రం సప్లయిచేసింది. ఇప్పుడు తన సేనలను ప్రత్యక్షంగా కాశ్మీర్ భూభాగంమీదికి పంపింది.

ఐ. రా. స. ఉపసంఘ సభ్యులు జూలై 10 న ఢిల్లీకి వచ్చినప్పుడు, ఉభయపక్షాలను సాయుధ చర్యలు విరమించవలసిందని కోరారు. ఏప్రిల్ 21 నాటి భద్రతాసమితి తీర్మానాన్ని అమలు జరిపేముందు, ఇండియా - పాకిస్తాన్ ప్రభుత్వాలచే యుద్ధ విరమణకు అంగీకరింపజేయడం తమ తక్షణ కర్తవ్యంగా వారు తీసుకున్నారు.

ఆగస్టు 13 న ఉపసంఘం చేసిన ఒక తీర్మానం ప్రకారం, వెంటనే ఉభయ ప్రభుత్వాలూ ఏకకాలంలో సాయుధచర్యలకు స్వస్తి చెప్పాలి. పాకిస్తాన్ ప్రభుత్వం తన సేనలను కాశ్మీర్ భూభాగం నుంచి ఉపసంహరించాలి. దాడి మూకలనుకూడా వెనక్కురప్పించాలి. ఆ తరువాత భారత ప్రభుత్వం తన సేనలలో అధికభాగాన్ని వెనక్కు రప్పించాలి. స్థానిక అవసరాలకు మాత్రమే తన సైనికుల్ని ఆ ప్రాంతంలో ఉంచాలి. ఈ యుద్ధవిరమణ సక్రమంగా అమలు జరిగేటట్లు చూడ్డానికి ఐక్యరాజ్యసమితి తన సైనిక పరిశీలకుల్ని పంపాలి.

ఈ తీర్మానాన్ని పురస్కరించుకొని 40 మంది సైనిక పరిశీలకుల్ని పంపవలసిందిగా ఐ. రా. స. కార్యదర్శికి ఉపసంఘం ఒక జాబు వ్రాసింది. వెంటనే భద్రతా సమితి సమావేశమై యీ సమస్యను చర్చకు తీసుకొంది. సోవియట్ ప్రతినిధి జాకబ్‌మాలిక్ ఏయే దేశాలకు ఉపసంఘ సభ్యులు ప్రాతినిధ్యం వహిస్తున్నారో ఆ యా దేశాలనుంచి పరిశీలకుల్ని పంపాలని ప్రతిపాదించాడు. కాని, ఆంగ్లో-అమెరికన్ కూటమి దీన్ని ఓడించి, తమ పలుకుబడిక్రింద వున్న కెనడా, ఆస్ట్రేలియా, బెల్జియం, నార్వే, అమెరికా దేశాలనుంచి సైనిక పరిశీలకుల్ని పంపాలని తీర్మానించింది.

ఈ పరిశీలకుల ద్వారా సామ్రాజ్యవాదులు కాశ్మీర్‌ను తమ పలుకుబడి క్రిందికి తెచ్చుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించారు.

రెండో వైపున ఐ. రా. స. ఉపసంఘం తన తీర్మానంపై భారత, పాకిస్తాన్ ప్రభుత్వాల అభిప్రాయం తెలుసుకోడానికి ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభించింది. ఉభయప్రభుత్వాలూ యుద్ధవిరమణ షరతులలో కొన్నిటిపై తమ సందేహాలను తెలియజేసి, వాటిని వివరించవలసిందిగా కోరాయి. వీటికి ఉపసంఘ నాయకుడు వ్రాసిన జవాబుల్లో పాకిస్తాన్‌కి ఒకవిధంగాను, భారత ప్రభుత్వానికి మరోవిధంగాను వ్యాఖ్యానం చెప్పాడు. ఉదాహరణకు, పాకిస్తాన్- ఆజాద్ కాశ్మీర్ సేనలు వుపసంహరింపబడిన తర్వాత ఆ ప్రాంతమంతా కాశ్మీర్ ప్రభుత్వంక్రిందికి వస్తుందని నెహ్రూకు అతడు జాబు వ్రాశాడు. కాని పాకిస్తాన్ ప్రతినిధికి వ్రాసిన జాబులో, ఆ ప్రాంతం పాక్ సేనల ఆక్రమణక్రిందే వుంటుందన్నాడు! ఈ విధంగా వుపసంఘ నాయకుడు ఒకరికి ఒకవిధంగాను, ఇంకొకరికి మరో విధంగాను వివరించాడు. ఈ విషయం యిద్దరికీ తెలియగానే, తమ తీర్మానాన్ని యిప్పుడప్పుడే అమలు జరపదలచుకోలేదని అతడు ప్రకటించాడు!

ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వాలకు అసలు విషయం చెప్పకుండా, ఉభయ పక్షాలను మోసంచేసి యుద్ధవిరమణకు అంగీకరింపజేస్తే సామ్రాజ్యవాదుల పంట పండుతుందని ఐ. రా. స. ఉపసంఘనాయకుడు ఈ పన్నాగం పన్నాడు. కాని, కొద్ది రోజుల్లోనే అది పటాపంచలైంది.

సెప్టెంబరు మాసంలో ఉపసంఘ సభ్యులు యూరప్ వెళ్ళిపోయారు. డిసెంబరు 11 న వారు భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలకు క్రింది సూచనలు చేశారు:

1. ఐ. రా. స. కార్యదర్శి సూచించే ప్లెబిసైట్ నిర్వహణాధికారిని కాశ్మీర్ ప్రభుత్వం అంగీకరించాలి.

2. అతడు జనవాక్య సేకరణకు ఏయే అధికారాలను కోరుతాడో వాటిని కాశ్మీర్ ప్రభుత్వం యివ్వాలి.

3. అతడు తనకు తోచిన సహాయ సిబ్బందిని, పరిశీలకుల్ని నియమించడానికి హక్కు వుండాలి.

4. అతనితో సివిల్-మిలిటరీ అధికారులు సహకరించాలి.

వీటిని ఉభయ ప్రభుత్వాలచేత ఒప్పింపజేయడానికి ఉపసంఘం యిద్దరు ప్రతినిధుల్ని ఢిల్లీ, కరాచీలకు పంపింది. వీరిలో ఒకడైన లొజానో నెహ్రూతో ఒక విధంగాను, పాక్ విదేశాంగమంత్రి జఫరుల్లాఖాన్‌తో మరొకవిధంగాను చెప్పాడు. ఉదాహరణకు ఆజాద్ కాశ్మీర్‌లోని 30,000 మంది సాయుధసైనికులను "పెద్దఎత్తున నిరాయుధుల్ని చేయడమే" ఉపసంఘంయొక్క ఉద్దేశమని లొజానో భారత ప్రధాని నెహ్రూకు చెప్పాడు. కాని జఫరుల్లాఖాన్‌కి సెప్టెంబరు 19 న వ్రాసిన జాబులో ఆజాద్ కాశ్మీర్ సైనికులను నిరాయుధుల్ని చేయబోమని తెలియజేశాడు!

ఎట్టకేలకు భారత-పాకిస్తాన్ ప్రభుత్వాలు 1945 జనవరి 5న ఐ. రా. స. ఉపసంఘం చేసిన తీర్మానాన్ని అంగీకరించి, యుద్ధవిరమణకు ఉత్తర్వులు జారీ చేశాయి. ఆ తీర్మానంలో ప్లెబిసైట్ నిర్వహణాధికారి నియామకం ఒక ముఖ్యాంశం.

యుద్ధవిరమణతో పాటు, ప్లెబిసైట్ నిర్వహణాధికారిని నియమించడం ద్వారా తమ "మధ్యవర్తిత్వాన్ని" కాశ్మీర్‌పై రుద్దడం సామ్రాజ్యవాదుల కొత్త యెత్తుగడ.

పై తీర్మానాన్ని పురస్కరించుకొని ఐక్యరాజ్యసమితి కార్యదర్శి ట్రిగ్వీలీ, ఒకప్పుడు అమెరికన్ నౌకాదళాధికారిగా పనిచేసిన ఎడ్మిరల్ నిమిడ్జ్‌ని నియమించాడు. అతనికిజీతం ఏడాదికి 45,000 డాలర్లు.

ఐ. రా. స. ఉపసంఘం త్వరితంగా యుద్ధవిరమణ ప్రతిపాదనలను అమలు జరిపేందుకు 1949 ఫిబ్రవరిలో భారతదేశానికి వచ్చింది. ఏప్రిల్ 15 న ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వాలకు తన సూచనలు తెలియజేస్తూ ఒక పత్రం అందజేసింది. అందులో 3 విభాగాలున్నాయి. మొదటిది యుద్ధవిరమణశ్రేణి: రెండవది కాశ్మీర్ నుంచిసాయుధ సేనల ఉపసంహారణ; మూడవది సాధారణ నిబంధనలు. రెండవ విభాగంలో పాకిస్తాన్ సేనల, ఇండియన్ సేనల ఉపసంహారణ ఏ పద్ధతుల్లో జరగాలో వివరంగా తెలియజేయబడింది.

ఈ విభాగంలోని అంశాలపై ఇండియా - పాకిస్తాన్‌ల మధ్య తీవ్రమైన భేదాభిప్రాయాలేర్పడ్డాయి. భారత ప్రభుత్వం, ఆజాద్ కాశ్మీర్‌లోని 3),000 సైనికుల్ని నిరాయుధులౌనర్చాలనీ, అలా నిరాయుధులౌనర్చే మేరకు తన సేనల్ని కూడా ఉపసంహరించుకొంటా ననీ తెలియజేసింది. పాకిస్తాన్ ప్రభుత్వం, ఆజాద్ కాశ్మీర్ సైనికుల్ని వెనక్కిరమ్మనడం గాని, ఆ ప్రాంతంపై ఇండియా సేనలూ కాశ్మీర్ ప్రభుత్వం అధికారం చెలాయించడంగాని ఏప్రిల్ 28 నాటి తీర్మానానికి సంబంధించిన విషయాలు కావని వాదించింది.

ఈ జవాబులనుబట్టి ఇండియాగాని, పాకిస్తాన్‌గాని ఏప్రిల్ 28 నాటి యుద్ధ విరమణ షరతులను అంగీకరించడంలేదని స్పష్టమవుతూన్నట్లు ఐ. రా. స. ఉపసంఘం తెలియజేసింది. అందుచేత ప్లెబిసైట్ నిర్వహణాధికారి ఎడ్మిరల్ నిమిడ్జ్ తన విధులను నిర్వర్తించడంలో జాప్యం జరుగుతుందని వారు ఆందోళన చెందారు. అందుచేత వారిలో అధిక సంఖ్యాకులు ఒక కొత్తపద్ధతి నవలంబించ దలిచారు. అది భద్రతా సమితి తీర్మానానికీ, ఉపసంఘ విధులకూ విరుద్ధం. అయితేనేం? కాశ్మీరుపై సామ్రాజ్యవాదుల పెత్తనం దానివల్ల నిరాటంకంగా కొనసాగుతుంది.

నిమిడ్జ్‌ని "పరిష్కార కర్త"గా నియమించడమే యీ కొత్త మార్గం.

ఎడ్మిరల్ నిమిడ్జ్‌మొదట జనవాక్య సేకరణకు నిర్వహణాధికారిగా మాత్రమే నియమింప బడ్డాడు. కాని, ఉపసంఘం అభిప్రాయపడ్డటు

అతన్ని పరిష్కారకర్తగా నియమించడానికంగీకరిస్తే, మొత్తం కాశ్మీర్ సమస్యను పరిష్కరించే అంతిమ నిర్ణయాధికారిగా అతడు మారుతాడు. ఉపసంఘ సభ్యుల్లో జెకోస్లొవేకియా ప్రతినిధి డాక్టర్ చిలీ తన నివేదికలో యిలా తెలియజేశాడు :

"పరిష్కారకర్తను నియమించాలనే సూచన ఉపసంఘం నిర్వర్తించవలసిన విధులకే వ్యతిరేకం. ఈ సూచన కాకతాళీయంగా చేయబడింది కాదు. అమెరికా ప్రతినిధి యీ సంవత్సరం జూన్‌మాసం నుంచీ యిందుకోసం ప్రయత్నిస్తూ వచ్చాడు. ఇందులో అతని ఉద్దేశం, ఎడ్మిరల్ నిమిట్జ్‌ని సాధ్యమైనంత త్వరగా పరిష్కారకర్త హోదాలో ఇండియా, పాకిస్తాన్‌లకు పంపడం...అతని ద్వారా యుద్ధవిరమణ జరిగితే, మొత్తం తగాదాను పరిష్కరించే నిర్ణయాధికారిగా అతడు తయారవుతాడు."

1949 ఆగస్టు 29 న ఐ. రా. స. ఉపసంఘం ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వాలకు ఒక మెమొరాండం పంపుతూ, నిమిట్జ్‌ని పరిష్కారకర్తగా అంగీకరించవలసిందని కోరింది. అతడు 1948 ఆగస్టు 15 నాటి తీర్మానంలో పేర్కొనబడ్డ 2 వ విభాగంలోని అంశాలపై తీర్పు చెబుతాడని వివరించింది.

ఈ మెమొరాండం పంపేముందు ఐ. రా. స. ఉపసంఘం రహస్యంగా సమావేశమైంది. బ్రిటన్-అమెరికాలకు దాన్ని అందజేసింది. తర్వాతనే భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలకు అందజేసింది. అది భారత ప్రభుత్వానికి అందేలోగా న్యూఢిల్లీలోని బ్రిటిషు హైకమీషనర్ చేతుల్లో పడిందని జెకోస్లొవేకియా ప్రతినిధి బయట పెట్టాడు. ఆ తర్వాత, అమెరికా అధ్యక్షుడు ట్రూమన్, బ్రిటిష్ ప్రధాని అట్లీ నిమిట్జ్‌ని పరిష్కారకర్తగా అంగీకరించవలసిందని భారత- పాకిస్తాన్ ప్రధానులకు జాబులు వ్రాశారు.

వీరిద్దరూ యిలా జోక్యం కల్పించుకున్నందుకు కాశ్మీర్‌లోను, భారతదేశంలోను తీవ్రమైన అసంతృప్తి వ్యాపించింది. భారత ప్రధాని అలహాబాద్‌లో ఉపన్యసిస్తూ యిలా అన్నారు :

"కాశ్మీర్ సమస్యపై ట్రూమన్ అధ్యక్షుడు, అట్లీ జోక్యం కల్పించుకున్నందుకు నేను ఆశ్చర్యపడుతున్నాను... ఈ సంఘర్షణకు మూలకారణమేమిటో చూడకుండా, దానినుంచి దృష్టిని పక్కదారులు పట్టించడం సరియైన పద్ధతికాదు. అట్టి పరిస్థితి మనకు చాల ఆందోళన, చీకాకు కలిగిస్తుంది."

కాశ్మీర్ జాతీయ మహాసభ వార్షిక సమావేశం (1949 సెప్టెంబరు) యీ సమస్యపై ఒక తీర్మానంచేస్తూ, నిమిట్జ్‌ని పరిష్కారకర్తగా నియమించడం కాశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికారాన్ని అపహరించడమేనని తెలియజేసింది.

1949 డిసెంబరులో ఐ. రా. స. ఉపసంఘంలోని మెజారిటీ సభ్యులు - అమెరికా, బెల్జియం, కొలంబియా, అర్జెంటీనా ప్రతినిధులు-భద్రతా సమితికి తమ నివేదికను సమర్పించారు. అందులో వారు 3 ప్రధాన విషయాలపై పరిశీ

లనలు జరిపినట్లు పేర్కొన్నారు. మొదటిది: ఆజాద్ కాశ్మీర్ సాయుధ బలాలు; రెండవది: కాశ్మీర్ సంస్థానంలోని ఇండియా-పాకిస్తాన్ సేనలు; మూడవది: ఉత్తర ప్రాంతంలో పరిపాలనా వ్యవస్థ. ఈ మూడు అంశాలపై ఇండియా-పాకిస్తాన్‌ల దృక్పథాలు వేర్వేరుగా ఉండడంవల్ల తగాదా పరిష్కరింప బడలేదని వారు చెప్పారు.

కాశ్మీర్ సమస్య అపరిష్కృతంగా ఉండడానికి ఇండియా - పాకిస్తాన్‌లు సమాన బాధ్యులని రుజువు చేసేందుకు వారు ప్రయత్నించారు. దురాక్రమణదారు లెవరో నిర్ధారణ చేయాలనే అభిప్రాయమే వారికి కలగలేదు. నేరస్థుణ్ణీ, ఫిర్యాదినీ ఏకగాటనకట్టి, తాము కోతితీర్పు చెప్పడానికి ప్రయత్నించినట్లు ఆ నివేదికనుబట్టి అర్థమవుతుంది.

జెకోస్లొవేకియా ప్రతినిధి పై నివేదికతో భేదిస్తూ తానొక ప్రత్యేక నివేది కను సమర్పించాడు. అందులో, మెజారిటీ సభ్యుల కుటిలనీతిని బయటపెట్టాడు. సంప్రతింపుల వైఫల్యానికి కారణం ఇండియా - పాకిస్తాన్‌ల వైఖరి కాదనీ, ఉప సంఘ కార్యకలాపాలే యిందుకు కారణమనీ అతడు నిరూపించాడు. ఇండియా - పాకిస్తాన్‌లమధ్య సంయుక్త సమావేశానికి అన్ని ఏర్పాట్లూ పూర్తిఅయి, ఉభయ ప్రభుత్వాల ప్రతినిధులు అందుకు ఆయత్తమవుతున్న సమయంలో ఐ. రా. స. ఉపసంఘం ఆకస్మాత్తుగా ఆ సమావేశాన్ని రద్దుచేయడం; ఎడ్మిరల్ నిమిడ్జ్‌ని పరిష్కారకర్తగా సూచించి తమకులేని అధికారాన్ని బుజానవేసుకోడం, రహస్య సమావేశంలో తాము తయారు చేసిన పత్రాన్ని ముందుగా బ్రిటన్ - అమెరికా లకు అందజేయడం - మొదలైన అక్రమపద్ధతులను అందులో నిశితంగా ఖండిం చాడు. నెహ్రూతో ఒక విధంగాను, జఫరుల్లాఖాన్‌తో మరొక విధంగాను చెప్పి, యిద్దరినీ మోసంచేయడానికి మెజారిటీ సభ్యులు అవలంబించిన జుగుప్సాకర పద్ధతులను తూర్పారపట్టాడు. జెకోస్లొవేకియా ప్రతినిధి తన నివేదికలో కొన్ని సిఫార్సులుకూడ చేశాడు. మొదటిది, కొత్తగా యేర్పడనున్న పరిష్కార యంత్రాంగం బయటివారి ప్రాబల్యానికి లోనుకాకుండా, స్వతంత్రంగా వ్యవహ రించాలి. రెండవది, భద్రతాసమితిలో సభ్యత్వంగల వారందరికీ ప్రాతినిధ్యం వహించగలవారితో మరొక ఉపసంఘాన్ని నియమించాలి; అప్పుడే అది స్వతం త్రంగా వ్యవహరించ గల్గుతుంది.

ఈ రెండునివేదికలను చర్చించడానికి భద్రతాసమితి 1949 డిసెంబరు 17 న సమావేశమైంది. భారతప్రతినిధి జెకోస్లొవేకియా సభ్యుని నివేదికను గురించి ఒక్కమాటైనా చెప్పకుండా, అప్రస్తావనే చేయకుండా ఊరుకోవడం భారత శ్రేయోభిలాషుల్ని ఆశ్చర్య పరచింది.

నార్వే ప్రతినిధి ఒక తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ, భద్రతా సమితి అధ్య క్షుడు జనరల్ మెక్‌నాటన్ ఇండియా - పాకిస్తాన్‌లముందు కొన్ని సూచన

ఉంచాలని కోరాడు. ఈ తీర్మానం అధిక సంఖ్యాకులచే ఆమోదింపబడింది. అందులోని ముఖ్య సూచనలు ఇవి :

1. యుద్ధ విరమణ శ్రేణికి ఇరువైపులా నివసించే ప్రజల్లో భయం కలుగని విధంగా ఉభయపక్షాల సాయుధ బలాలను ఉపసంహరించుకోవడానికి అంగీకృత కార్యక్రమాన్ని తయారు చేసుకోవాలి.

2. ఈ కార్యక్రమంలో ఆజాద్ కాశ్మీర్ సాయుధ బలాలనూ, పాకిస్తాన్ ఇండియా సేనలనూ ఉపసంహరించుకోడంతో బాటు సాయుధ వలంటీర్ దళాలనుకూడా రద్దు చేయాలి.

3. ఉత్తర ప్రాంతాల పరిపాలన స్థానికాధికారులచే నిర్వహింపబడాలి; వారిపై ఐ. రా. స. అజమాయిషీ చేస్తుంది.

4. పై చర్యలు ఐ. రా. స. ప్రతినిధికి సంతృప్తి కలిగిస్తే అప్పుడు ప్లెబిసైట్ నిర్వహణాధికారి జనవాక్య సేకరణకు సంబంధించిన చర్యలు తీసుకోవాలి.

5. సాయుధ బలాల ఉపసంహరణను తనిఖీ చేయడానికి ఒక ఐ. రా. స. ప్రతినిధి నియమింపబడాలి.

పై అంశాలను పరిశీలిస్తే, ఐ. రా. స. ఉపసంఘం లోగడ భారత ప్రభుత్వానికిచ్చిన హామీలేవీ వీటిలో లేవని స్పష్టమవుతుంది. యుద్ధవిరమణ శ్రేణికి ఈవలనున్న ప్రాంతంపై కాశ్మీర్ ప్రభుత్వానికి సర్వాధికారాలు ఉంటాయనే విషయం వీటిలో లేదు. రెండవది, ఆజాద్‌కాశ్మీర్ చట్టబద్ధ ప్రభుత్వంగా గుర్తింపబడింది. మూడవది, ఆజాద్‌కాశ్మీర్ బలాలు ఉపసంహరింపబడాలనే సూచనతో బాటు కాశ్మీర్ సేనలూ, వలంటీర్ దళాలూకూడా ఉపసంహరింపబడాలని ఉంది. నాల్గవది, ఉత్తర ప్రాంతాలపై భారతప్రభుత్వానికి ఎట్టి అధికారం ఉండదని స్పష్టం చేయబడింది.

ఈ కారణాలవల్ల భారత ప్రతినిధి శ్రీ బి. ఎన్. రావు తన తీవ్ర అసంతృప్తిని తెలియజేశారు.

పై మెక్‌నాటన్ పథకంలో యిదివరకువలె రెండు నాలుకల వ్యవహారం ఎక్కడా కనబడదుగాని, సామ్రాజ్యవాదుల అసలు ఉద్దేశాలు మాత్రం స్పష్టంగా వ్యక్తమవుతున్నాయి.

భారత ప్రభుత్వం దీన్ని తిరస్కరించింది.

1950 మార్చి 14 న భద్రతా సమితి తిరిగి సమావేశమైనప్పుడు అమెరికా బ్రిటన్, నార్వే, క్యూబాల ప్రతినిధులొక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. దాని ప్రకారం ఐ. రా. స. ఉపసంఘం రద్దుచేయబడి, దాని స్థానంలో ఒక ఐ. రా. స. ప్రతినిధి నియమింపబడతాడు. ఐదు మాసాల్లో ఇండియా - పాకిస్తాన్ ప్రభుత్వాలు మెక్‌నాటన్ సూచనల మేరకు తమతమ సాయుధబలాలను ఉపసంహరించుకోవలసిందని కూడా ఆ తీర్మానం విజ్ఞప్తి చేసింది. అంతేగాక ఐ. రా. స.

ప్రతినిధి కొత్త సూచనలేవైనా చేయవలసి వుంటే అట్టి అధికారం అతనికుంటుం దని తీర్మానంలో పేర్కొనబడింది.

భారత ప్రభుత్వం ఈ తీర్మానాన్ని కొన్ని మినహాయింపులతో అంగీకరించింది

బ్రిటన్, అమెరికన్ పాలకవర్గాలు సర్ ఓవెన్ డిక్సన్‌ని ఐ. రా. స. ప్రతినిధిగా సూచించారు. దాన్ని భద్రతా సమితి అంగీకరించింది.

డిక్సన్ ఆస్ట్రేలియాలో ఉన్నత న్యాయాధికారి; అమెరికన్ పాలకవర్గాల అనుంగు మిత్రుడు. ఇతడు 1950 మే 27 న భారతదేశానికి వచ్చాడు.

కాశ్మీర్ సమస్యను పరిష్కరించడానికి యితడొక కొత్త పథకం తయారు చేశాడు. అందులోని ముఖ్యాంశాలు :

ఆజాద్ కాశ్మీర్‌లో పరిపాలనాధికారం, దానికి పూర్వం ఉన్నట్లు జిల్లా మేజిస్ట్రేట్ల చేతుల్లో ఉంటుంది. అయితే, ప్రతిజిల్లా మేజిస్ట్రేటు ఒక ఐ. రా. స. ఉద్యోగి సలహా ప్రకారం తన విధులను నిర్వర్తించాలి. ఈ ఉద్యోగి జిల్లా మేజిస్ట్రేటు రికార్డులన్నిటినీ తెప్పించుకొని చూడవచ్చు. అతడు లిఖితపూర్వకంగా అనుమతిస్తేగాని జిల్లా మేజిస్ట్రేటు ఎవరినీ అరెస్టుచేయడానికి ఉత్తర్వులు జారీ చేయకూడదు.

యుద్ధవిరమణ శ్రేణిని రద్దుచేసి, కాశ్మీర్ అంతటినీ ఒకే ప్రభుత్వం క్రిందకు తెచ్చే సాకుతో డిక్సన్ మూడు ప్రతిపాదనలు చేశాడు. వాటిలో ఏదో ఒకదానికి అంగీకారం తెల్పవలసిందని ఇండియా - పాకిస్తాన్‌లకు సూచించాడు. ఆ మూడు సూచనలు యివి :

1. ఆజాద్ కాశ్మీర్, జమ్మూ-కాశ్మీర్‌లకు ఒకే ఒక మిశ్రమ మంత్రివర్గం. ఇందులో అబ్దుల్లా సహచరులూ, గులామ్ అబ్బాస్ (ఆజాద్ కాశ్మీర్ ప్రధాని) సహచరులూ ఉండాలి.

2. సంస్థాన ప్రభుత్వం రాజకీయాలతో సంబంధంలేని ప్రభుత్వ ఉన్నతోద్యోగులతో యేర్పడాలి; దానికి అధ్యక్షుడుగా ఐక్యరాజ్యసమితి నియమించే వ్యక్తి ఉండాలి.

3. కాశ్మీర్ ప్రభుత్వం పూర్తిగా ఐ. రా. స. ఉద్యోగులచే నిర్వహింప బడాలి.

పై సూచనలనుబట్టి ఒకవిషయం స్పష్టమవుతుంది. కాశ్మీర్ భూభాగాన్ని ఒకే ప్రభుత్వం క్రిందికి తెచ్చేసాకుతో, డిక్సన్ ఐక్యరాజ్యసమితికి సర్వాధికారాలు యిచ్చి, కాశ్మీర్‌పై ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్య వాదులకు పెత్తనం ఉండేటట్లు తన పథకాన్ని తయారుచేశాడు.

ఈస్కీమును భారతప్రభుత్వం నిరాకరించింది.

వెంటనే డిక్సన్ మరో పథకాన్ని తయారుచేశాడు. దీనిప్రకారం కాశ్మీర్ రెండుగా విభజింపబడుతుంది; ఒక భాగం పాకిస్తాన్‌కి, మరొక భాగం ఇండియాకు

వెళ్తాయి. జనవాక్యసేకరణ జరిగినా జరక్కపోయినా, కాశ్మీర్‌లో కొన్ని ప్రాంతాలు పాకిస్తాన్‌లోను, మరికొన్ని ప్రాంతాలు ఇండియాలోనూ చేర డానికి ఎలాగూ అంగీకరిస్తాయిగనుక, అట్టి ప్రాంతాలను ఆయా ప్రభుత్వాలకు వప్పగించివేయాలి. 'కాశ్మీర్‌లోయ'లో మాత్రం జనవాక్యసేకరణ జరగాలి. అయితే అది ఐక్యరాజ్య సమితి అధికారులచే నిర్వహింపబడాలి. అట్టి సంస్థకు ప్లెబిసైట్ నిర్వహణాధికారి అధ్యక్షత వహించాలి.

డిక్సన్ తన స్కీమును వివరిస్తూ, "ప్రభుత్వ విధులన్నిటినీ యీ ఐ.రా.స. ఉపసంఘమే నిర్వహిస్తుంద"ని తెలియజేశాడు. జనవాక్య సేకరణకు, సంస్థాన విభజనకు సంబంధించిన కార్యక్రమం పూర్తికావడానికి "అయిదు లేక పది సంవత్సరాలు పట్టవచ్చున"ని లండన్ 'టైమ్స్' పత్రిక తెలియజేసింది.

డిక్సన్ తయారు చేసిన రెండవ పథకాన్నిబట్టి బోధపడేదేమంటే, ఇటు పాకిస్తాన్‌కి కొంతప్రాంతం, అటు ఇండియాకు కొంతప్రాంతం యిచ్చివేయడం ద్వారా, ఉభయ ప్రభుత్వాలను అతడు సంతృప్తిపరచ దలచాడు. కాని 'కాశ్మీర్ లోయ'పై అధికారం ఆ ఉభయ ప్రభుత్వానికి లేకుండాచేసి, ఐక్యరాజ్య సమితి పేరుతో వ్యవహరించే ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు ఆ ప్రాంతాన్ని ధారాదత్తం చేయదలచాడు.

మూడవ ప్రపంచ యుద్ధంలో 'కాశ్మీర్ లోయ'ను కీలకస్థానంగా చేసుకో డానికి బ్రిటీషు-అమెరికన్ పాలకులు 1946 నుంచీ ప్రయత్నిస్తూ వచ్చారనే విషయాన్ని మనం మరువరాదు.

ఇండియా-పాకిస్తాన్ ప్రభుత్వాలు సూత్రప్రాయంగా కాశ్మీర్ విభజనకు, 'కాశ్మీర్‌లోయ'లో జనవాక్య సేకరణకు అంగీకరించాయి. కాని భారత ప్రభుత్వం జనవాక్య సేకరణకై ఐ. రా. స. కీయబడుతున్న అసాధారణాధికారాలను వ్యతి రేకించింది.

అందుచేత డిక్సన్ ఆశలు అడియాసలయాయి. తన ప్రయత్నాలు విఫల మైనట్లు అతడు భద్రతా సమితికి నివేదించాడు.

ఇదే సమయంలో చైనా ప్రజలు సాయుధ విప్లవంద్వారా సామ్రాజ్య వాదుల పెత్తనాన్ని నిర్మూలించి, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం క్రింద సర్వ స్వతంత్రమైన ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్థాపించుకున్నారు. ఈ చరి త్రాత్మక ఘటన ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల్ని గంగ వెర్రులెత్తించింది. కాశ్మీర్‌కి ఉత్తరాన సింకియాంగ్, తూర్పున టిబెట్ ఉండడంవల్ల కాశ్మీర్ ప్రాముఖ్యత మరీ హెచ్చింది. సింకియాంగ్, టిబెట్‌లు చైనా ప్రజాసేనలచే విముక్తి చేయబడ్డవల్ల వాటి సరిహద్దున వున్న కాశ్మీర్‌ను త్వరలో తమ ప్రాబల్యం క్రిందికి తెచ్చుకోవాలనే కోరిక సహజంగా బ్రిటిష్, అమెరికన్ పాలకుల్లో కలిగింది.

బ్రిటిష్ కామన్వెల్తులో ఇండియా, పాకిస్తాన్‌లు రెండూ సభ్యత్వదేశాలే గనుక, కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో కూడ కాశ్మీర్ సమస్యను చర్చించ వలసిందిగా అమెరికన్ పాలకులు 1951 లో బ్రిటన్‌ని కోరారు. బ్రిటన్ యిందు కంగీకరించింది. కాశ్మీర్ తగాదా అపరిష్కృతంగా ఉండడంవల్ల ఆగ్నేయాసియా దేశాలు ఆత్మరక్షణకై చేస్తున్నకృషి దెబ్బతింటూందని బ్రిటిష్ ప్రతినిధి ఈ సమావేశంలో వాదించాడు. జనవాక్య సేకరణను అంగీకరించమని భారత ప్రతినిధిపై ఒత్తిడి తెచ్చాడు. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ ప్రధానులు తమ సేనలను కాశ్మీరుకు పంపుతామనీ, జనవాక్య సేకరణ జరుగుతూన్నంతకాలం అవి శాంతి - భద్రతలను కాపాడుతాయనీ తెలియజేశారు. కాని ప్రధాని నెహ్రూ యీ సూచనను తిరస్కరించారు.

1951 ఫిబ్రవరిలో భద్రతాసమితి తిరిగి సమావేశమైంది. బ్రిటన్, అమెరికాలు కలిసి ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాయి. దాని ప్రకారం ఐ. రా. స. లో సభ్యత్వంగల దేశాలనుంచి కాశ్మీర్‌లో యుద్ధం విరమింపజేయడానికి, జనవాక్య సేకరణకు సేనలను పంపే యేర్పాట్లు చేయవచ్చు. వివాదగ్రస్త సమస్యలన్నిటిపైన తీర్పు చెప్పడానికి ఒక పరిష్కారకర్త లేదా కొందరు పరిష్కారకర్తలు నియమింపబడాలి.

అంతకుముందు 1950 అక్టోబరు మాసంలో కాశ్మీర్ జాతీయ మహాసభ కాశ్మీర్ విభజనను వ్యతిరేకిస్తూ తీర్మానించడమేగాక, వయోజనులందరిచే ఎన్నుకోబడు కాశ్మీర్ రాజ్యాంగనిర్ణాయసభ సంస్థాన భవిష్యత్తును నిర్ణయిస్తుందని ప్రకటించింది. ఈ చర్య సామ్రాజ్యవాదుల్ని గాబరా పెట్టింది. భద్రతాసమితి సమావేశంలో బ్రిటిష్ ప్రతినిధి మాట్లాడుతూ, కాశ్మీర్ జాతీయ మహాసభ తీర్మానం "భద్రతాసమితియొక్క, ఐక్యరాజ్యసమితియొక్క అధికారానికే సవాలు" అంటూ చిందులు తొక్కాడు.

భద్రతాసమితిలో ఇండియా ప్రతినిధి శ్రీ బి. యన్. రావు బ్రిటన్ - అమెరికాల సంయుక్త తీర్మానాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. భారత ప్రభుత్వం ఎన్నటికీ కాశ్మీర్‌లో విదేశ సేనలఉనికిని సహించదని ఆయన స్పష్టం చేశారు.

ఈ తీర్మానాన్ని భారతదేశ ప్రజలు, పత్రికలుకూడ తీవ్రంగా వ్యతిరేకించడం చూచి, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు కొంచెం వెనక్కు తగ్గారు. మార్చి 21 న తమ తీర్మానంలో కొన్ని సవరణలు చేశారు. విదేశ సేనల విషయం అందులో వదలివేయబడింది. అయితే, ఐ. రా. స. ప్రతినిధి (డిక్సన్ స్థానే నియమింపబడు వ్యక్తి) 1948 ఆగస్టు 13, 1949 జనవరి 5 నాటి తీర్మానాల కనుగుణ్యంగా కాశ్మీర్‌లో నిస్సైనికీకరణను అమలు జరపవలసిందని ఆ తీర్మానం నిర్దేశించింది.

ఆ తీర్మానం 1951 మార్చి 30 న భద్రతాసమితిచే ఆమోదింపబడింది. ఆంగ్లో - అమెరికన్ మెజారిటీ ఫ్రాంక్ గ్రాహం అను అమెరికన్ సైనికనిపుణుని ఐ. రా. స. ప్రతినిధిగా ఎన్నుకున్నారు.

గ్రాహం తన సిబ్బందితో (వీరిలో అత్యధిక సంఖ్యాకులు అమెరికన్లు) కలిసి బయల్దేరాడు. జనరల్ జేకబ్ డెవర్స్ అను అమెరికన్ సైనిక నిపుణుడు యితనికి సలహాదారు.

1951 తర్వాత పశ్చిమరాజ్యాలవారు, కాశ్మీర్ ప్రభుత్వానికి బదులు తమ ప్రభుత్వాన్ని నెలకొల్పాలనే ఆలోచనను వదులుకున్నారు. తదనుగుణ్యంగా మార్చి 30 నాటి తీర్మానాన్ని సవరించారు. సాధ్యమైనంత త్వరలో ఎడ్మిరల్ నిమిడ్జ్‌ని ప్లెబిసైట్ నిర్వహణాధికారిగా తీసుకురావడం, కొన్ని వేలమంది విదేశీయుల్ని ఆయుధాలతోసహా ఐ. రా. స. పరిశీలకులుగా రప్పించడం-ఇదీ వారి సరికొత్త ఎత్తుగడ. దీనిప్రకారం కాశ్మీర్ ప్రభుత్వం పేరుకు మాత్రమే గుర్తింపబడుతుంది. ఆచరణలో అమెరికా- బ్రిటన్‌లే పెత్తనం చెలాయిస్తాయి.

గ్రాహం జూన్ - సెప్టెంబరు మాసాలమధ్య నిస్సైనీకరణ సమస్య మీద తన దృష్టినిలగ్నం చేశాడు. ఇది పరిష్కారమైతేగాని, నిమిడ్జ్ నియామకాన్ని భారత ప్రభుత్వం అంగీకరించదని అతనికి తెలుసు. ఈ ఉద్దేశంతో అతడు 12 అంశాలతో కూడిన ఒక పథకాన్ని తయారుచేశాడు. దానిప్రకారం యుద్ధవిరమణ శ్రేణికి ఈవల, ఆవల ఎంతెంతమంది సాయుధసైనికుల్ని ఉంచాలో ఇండియా-పాకిస్తాన్ ప్రభుత్వాలు తమ అభిప్రాయాలు తెలియజేయాలి.

ఈ విషయంలో ఉభయదేశాల ప్రతినిధులూ కొన్ని సూచనలు చేశారు.

తర్వాత, సంప్రతింపుల్లో రెండవదశ ప్రారంభమైంది. (1951 నవంబరు - డిసెంబరు) ఈ సారి గ్రాహం ఐ. రా. స. పరిశీలకుల సంఖ్యను పెంచవలసి యుంటుందనీ, ప్రభుత్వ సేనలస్థానే విదేశసేనలు కాశ్మీర్‌లో శాంతి - భద్రతలను కాపాడాలనీ, ప్లెబిసైట్ నిర్వహణాధికారిని త్వరలో నియమించాలనీ తెలియజేశాడు. అతని సైనిక సలహాదారు అంచనా ప్రకారం 800 మంది ఆఫీసర్లు, 600 సిబ్బంది అవసరమవుతారు. వారందరికీ ఆయుధాలు వగైరా సప్లయిచేయాలి. తర్వాత ఈ సంఖ్య కొన్నివేలకు హెచ్చింపబడింది.

భారత ప్రభుత్వం ఈ సూచన లన్నిటినీ వ్యతిరేకించింది. భారత భూభాగంలో అదనపు "పరిశీలకులు" అవసరంలేదని తెల్పింది. కాశ్మీర్‌లో శాంతి - భద్రతలను ప్రభుత్వమే చూచుకొనగలదని స్పష్టంచేసింది. ప్లెబిసైట్ నిర్వహణాధికారిని ఇప్పుడప్పుడే నియమించ నక్కర్లేదని తెలిపింది. కాని పాకిస్తాన్ ప్రభుత్వం వీటన్నిటినీ అంగీకరించింది.

ఈ విధంగా ఇండియా ప్రభుత్వం ఆంగ్లో - అమెరికన్ కుట్రకు వ్యతిరేకంగా నిలబడింది.

ఈ సందర్భంలో సోవియట్ ప్రతినిధి జేకబ్ మాలిక్ భద్రతా సమితిలో ప్రసంగిస్తూ, బ్రిటన్ - అమెరికాల దురాక్రమణ తత్వాన్ని బహిర్గతం చేశాడు. అతడిలా అన్నాడు :

"కాశ్మీర్ సమస్యకు సంబంధించిన యీ పథకాలన్నిటి ఉద్దేశం ఒక్కటే. అది, కాశ్మీర్ భూభాగం మీదికి బ్రిటన్ - అమెరికా సేనలను పంపి, దాన్నొక ఆంగ్లో - అమెరికన్ వలస ప్రాంతంగా, సైనిక స్థావరంగా మార్చడం."

భద్రతా సమితిలో మాలిక్ ఉపన్యసిస్తూ, ఐ. రా. స. సైనికుల్ని పంపే ప్రసక్తి భద్రతా సమితి తీర్మానంలో వదలివేయబడిన తర్వాత, గ్రాహం తిరిగి ఇండియా - పాకిస్తాన్ ప్రభుత్వాలకు ఆ సూచనే చేయడానికి అధికార మెవరిచ్చారు - అని ప్రశ్నించాడు. ఈ చర్యనుబట్టి బ్రిటన్, అమెరికాలు కాశ్మీరు ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొంటున్నట్లు స్పష్టమవుతూందని విమర్శించాడు. కాశ్మీర్ ప్రజలు తమ భవిష్యత్తును తాము నిర్ణయించుకోగల రని స్పష్టంచేశాడు.

భద్రతా సమితి యిక చేసేది లేక, గ్రాహంని మళ్ళీ- అంటే మూడవసారి - ఇండియా, పాకిస్తాన్‌లతో సంప్రతింపులు జరపమని ఆదేశిస్తూ తీర్మానించింది.

1952 ఫిబ్రవరి- మార్చి నెలల మధ్య తిరిగి సంప్రతింపులు ప్రారంభ మయాయి. నిస్సైనీకరణ తర్వాత యిరువైపులా ఎంతెంతమంది సాయుధ సైనికులు ఉండాలి - అనే సమస్యపై ఇండియా- పాకిస్తాన్‌లమధ్య భేదాభిప్రాయా లేర్పడ్డాయి. అందుచేత త్వరగా ఎడ్మిరల్ నిమిడ్జ్‌ని రంగం మీదికి తేవడానికి గ్రాహం ఒకకొత్తమార్గం అవలంబించాడు. నిస్సైనీకరణకు సంబంధించినవివరాలతో బాటు ప్లెబిసైట్ విషయమై కొంత అత్యవసరసమాచారం కూడా ఇప్పుడే కావలసి యుందనీ, ఇందుకు నిమిడ్జ్‌తో తాను సంప్రతించవలసి యుందనీ అతడు ప్రతిపాదించాడు. ఈ సూచనను ఇండియా- పాకిస్తాన్ ప్రభుత్వాలు అంగీకరించి యుంటే, జనవాక్యసేకరణకు సంబంధించిన కార్యకలాపాలింకా ప్రారంభం కాక పోయినప్పటికీ, ప్లెబిసైట్ నిర్వహణాధికారిని ఆహ్వానించడమే అయేది. భారత ప్రభుత్వం ఈ సూచనను కూడా అంగీకరించ లేదు. గ్రాహం ప్లాను భగ్నమైంది.

1952 జూలై 12 న అతడు న్యూయార్కులో ఇండియా-పాకిస్తాన్ ప్రతినిధుల్ని సమావేశపరిచి, తన 12 అంశాల ప్రణాళికను వివరించాడు. దానిపై అభిప్రాయాలు తెలిపవలసిందని కోరాడు. తదనుగుణ్యంగా ఆగస్టు 26 నుంచి సెప్టెంబరు 10 వరకు ఉభయప్రభుత్వాల ప్రతినిధులు తిరిగి సమావేశమయారు. ఆ సమావేశంలో గ్రాహం మళ్లీ ప్లెబిసైట్ నిర్వహణాధికారి నియామకాన్ని గురించి నొక్కిచెప్పాడు. నిస్సైనీకరణతర్వాత యిరువైపులా ఎంతెంతమంది సైనికులుండాలి-అనే విషయాన్ని తిరిగి చర్చకు ప్రతిపాదించాడు. కాని ఏకాభిప్రాయం కుదరనందున ఆ ప్రయత్నంకూడా విఫలమైంది. నిమిడ్జ్ నియామకాన్ని

గురించి భారత ప్రతినిధి తన అభిప్రాయం చెబుతూ, నిస్సైనికీకరణ ఏర్పాట్లన్నీ పూర్తికాకముందే అతన్ని నియమించడం సరికాదని తెలియజేశాడు. అందుచేత గ్రాహం నాల్గవసారి జరిపిన సంప్రదింపులుకూడా విఫలమయాయి.

1952 నవంబరులో భద్రతాసమితి సమావేశమైనప్పుడు గ్రాహం సమర్పించిన తుది నివేదిక చర్చకు వచ్చింది. ఈసారి బ్రిటన్ - అమెరికాలు ఒక సంయుక్త తీర్మానంలో ఇండియా - పాకిస్తాన్‌లకు అంతిమ ఆదేశం యిచ్చారు. దాని ప్రకారం, కాశ్మీర్‌లో నిస్సైనికీకరణ జరిగిన తర్వాత పాకిస్తాన్ భూభాగంలో 3000 నుండి 6000 మంది, ఇండియా భూభాగంలో 120 0 నుండి 18000 మంది సైనికు లుండేటట్లు ఉభయపక్షాలూ అంగీకరించి, వివరాలతో తమ అభిప్రాయాలను తెలియజేయాలి.

ఈ తీర్మానాన్ని ప్రవేశపెడుతూ బ్రిటన్, అమెరికాల ప్రతినిధులు తమ కుట్రను నగ్నంగా బయటపెట్టుకున్నారు. త్వరలో ఎడ్మిరల్ నిమిడ్జ్‌ని ప్లెబిసైట్ నిర్వహణాధికారిగా తాము పంపబోతున్నామనీ, తమ సైనికుల్ని కూడా కాశ్మీరులో దింపబోతున్నామనీ వారు తెలియజేశారు.

ఈ తీర్మానాన్ని సోవియట్ ప్రతినిధి జోరిన్ తీవ్రంగా ఎదుర్కొన్నాడు. కాశ్మీర్ విషయమై బ్రిటన్, అమెరికాలు అనుసరిస్తున్న విధానంలో సామ్రాజ్యతత్వం ఉన్నదని విమర్శించాడు.

భారతప్రతినిధి ఈ ప్రతిపాదనను వ్యతిరేకించాడు. అయినా, మెజారిటీతో తీర్మానం పాసయింది (1952 డిసెంబరు 23).

## 5 వ అధ్యాయం

# ఆంతరంగిక సమస్యలు

కాశ్మీర్‌పై జరిగిన దండయాత్ర అసలే బలహీనంగావున్న ఆర్థిక వ్యవస్థను భిన్నాభిన్న మొనర్చింది. అత్యధిక సంఖ్యాక రైతులు సొంత భూమిలేక, తమ శ్రమ ఫలితంలో అధికభాగాన్ని భూస్వాములకు, షాహుకార్లకు, ప్రభుత్వానికి కట్టబెట్టి, నిత్యదారిద్ర్యంతో కుములుతూ, చేతి పరిశ్రమలవల్ల వచ్చే కొద్దిపాటి ఆదాయం కుటుంబ పోషణకు చాలక సతమతమవుతున్న పరిస్థితుల్లో యీ దండయాత్ర వచ్చింది.

దాడి మూకలు అనేక ప్రాంతాల్లో ఆహారధాన్యాలను కొల్లగొట్టుకున్నారు. పంటలను నాశనం చేశారు. వ్యవసాయపు పనులకు అంతరాయం కలిగించారు. దీనితోడు కొన్ని ప్రాంతాలు వరదలవల్ల, మరికొన్ని వర్షాలులేక దెబ్బతిన్నాయి. దేశవిభజన ఫలితంగా, జీలంలోయకూ భారతదేశానికీ మధ్య వున్న రోడ్డు మూసివేయబడ్డంవల్ల, కాశ్మీర్ - భారతదేశాల మధ్య రాకపోకలు సంవత్సరంలో నాలుగు మాసాలు (శీతకాలం అంతా) బందయ్యాయి. చేతి పరిశ్రమలవల్ల తయారైన సరుకులు నిలవ ఉండిపోయాయి. విదేశాలనుంచి వచ్చే యాత్రీకుల సంఖ్య తగ్గిపోవడంవల్ల ప్రజలు మరీ యిబ్బందులపాలయ్యారు. పడవలవారు, బళ్ళు తోలుకొనేవారు, చేతి వృత్తులవారు జీవనాధారం లేక యమయాతనలు అనుభవించారు.

ప్రభుత్వానికి ఎక్కువ అదాయాన్నిచ్చే కలప పరిశ్రమ దేశ విభజనవల్ల, దండయాత్రవల్ల మూలపడింది. సాధారణంగా కాశ్మీర్‌లో ఉత్పత్తి అయే కలప జీలం, చీనాబ్ నదులమీదుగా జీలం, వజీరాబాద్ రైలుస్టేషన్లకు చేర్చబడేది. అక్కడనుంచి పంజాబులో అనేక కేంద్రాలకు పంపబడేది. కాని జీలం, వజీరాబాద్‌లు పాకిస్తాన్‌లో చేరిపోవడంవల్ల ఈ రెండు నదులూ నిరుపయోగమయాయి. ఇలాగే, కాశ్మీర్ - ఇండియాల మధ్య రాక పోకలు ఆగిపోయినందున పండ్ల పరిశ్రమకూడా దెబ్బతింది. ప్రజలు కొనుక్కొనే ఉప్పు, పంచదార, బట్ట, కిరసనాయిలు మొదలైన జీవితావసర వస్తువులధరలు ఆకాశాన్నంటాయి. కాశ్మీర్

లోయలో ఉప్పు కొంతకాలం సేరు రు. 16 అమ్మిందంటే, పరిస్థితి ఎంత విషమించిందో అర్థం చేసుకోవచ్చు.

కాశ్మీర్ జాతీయ మహాసభ అధికారంలోకి వచ్చిన తర్వాత, ప్రభుత్వాన్ని యీ క్లిష్ట సమస్యలన్నీ ఎదుర్కొన్నాయి. జాతీయ మహాసభ ప్రజాఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న రోజుల్లో, భూస్వామ్య వ్యవస్థను రద్దుచేసి ప్రజాతంత్ర పాలనను నెలకొల్పడానికి కొన్ని ముఖ్యసంస్కరణలు అవసరమని ప్రచారం చేసింది. అవి "నూతన కాశ్మీర్" అనే ప్రణాళికలో రూపొందింప బడ్డాయి. అందులో ముఖ్యమైనవి యివి : భూస్వాముల భూమిని సాగుదార్లకు ఉచితంగా పంచిపెట్టడం; పన్నుల భారాన్ని, అప్పుల భారాన్ని తగ్గించడం; నిర్బంధ వసూళ్ళను రద్దుచేయడం; సహకార సంస్థలద్వారా ఋణసౌకర్యాలు కలిగించడం; కార్మికుల హక్కులను కాపాడ్డం; రాకపోక సౌకర్యాలు చేకూర్చడం; ఉచిత ప్రాథమిక విద్య, వైద్య సహాయం కలుగజేయడం; ప్రజలకు పౌరసత్వ హక్కులు, సమానావకాశాలు ఉండే నూతన రాజ్యాంగాన్ని తయారుచేయడం.

షేక్ అబ్దుల్లా నాయకత్వంక్రింద ఏర్పడ్డ మంత్రివర్గం, ఈ ప్రణాళికను అమలుజరపడానికి తగు చర్యలు తీసుకొంటుందని సహజంగా ప్రజలు ఆశించారు. ఇందు కనుగుణ్యంగా మంత్రివర్గం కొన్ని శాసనాలు చేసింది. వీటిలో ముఖ్యమైనది, పెద్ద భూస్వాముల భూమిని స్వాధీనం చేసుకునే చట్టం. ఇది 1951 లో అమల్లోకి వచ్చింది. దీని ప్రకారం, 23½ యకరాలకు మించివున్న భూస్వాముల అదనపు భూమిని ప్రభుత్వం కౌలుదార్లకు ఉచితంగా పంచియిచ్చింది. భూస్వాములకు నష్టపరిహారం యివ్వాలా అక్కర్లేదా అనే విషయాన్ని నిర్ణయించేందుకు ఒక ఉపసంఘాన్ని నియమించింది. పట్టణాలలోను, గ్రామసీమల్లోను ప్రజల ఋణభారాన్ని తగ్గించేందుకు ఋణపరిష్కార సంఘాలను ఏర్పాటుచేసింది. జీవితావసరవస్తువుల దిగుమతి, వ్యాపారవస్తువుల ఎగుమతి ధారాళంగా జరగడానికి ప్రభుత్వం మోటారు రవాణాను వశపరచుకొంది. సంస్థాన నగరాలలోను, భారతదేశ ముఖ్యపట్టణాల్లోను చేతిపరిశ్రమల ఎంపోరియంలు తెరిపించింది. కాశ్మీర్‌కి ప్రత్యేకమైన రాజ్యాంగాన్ని తయారుచేసేందుకు వయోజనులందరిచే ఎన్నుకోబడ్డ రాజ్యాంగ నిర్ణయసభను ఏర్పరచింది.

ఈ సంస్కరణలన్నీ నిజంగా అభ్యుదయకరమైనవే. ప్రజల ఆర్థికపరిస్థితిని చక్కబరచడానికి తోడ్పడేవే. కాని, వీటిని అమలుజరపడంలో కాశ్మీరు ప్రభుత్వం ప్రజల్ని పెద్దయెత్తున సమీకరించలేదు. నిరంకుశోద్యోగుల మీదనే ప్రధానంగా ఆధారపడింది. అందుచేత భూస్వాములు, వడ్డీ వ్యాపారస్తులు ప్రభుత్వ శాసనాలకు తూట్లుపొడవడానికి ఎన్ని చేయాలో అన్నీ చేశారు. ముఖ్యంగా భూస్వాములు తమకున్న భూమిని గురించి దొంగ లెక్కలు తయారుచేయడం, వాటిని అధికారులచే ఆమోదింపజేయడం చాల సందర్భాలలో జరిగింది. రైతులు

తమ హక్కులను కాపాడుకోడానికి ఉద్యోగులకు పెద్దపెద్ద మొత్తాలను లంచాలుగా యిచ్చుకోవలసి వచ్చింది.

అంతేకాదు. పూర్వం నుంచీ రైతులు తమ పంటలో అధిక భాగాన్ని ప్రభుత్వానికి చౌకధరలకు విక్రయించాలి. ఈ పద్ధతిని కొత్త ప్రభుత్వం రద్దుచేయలేదు. కొన్ని సందర్భాలలో రైతు బ్లాక్‌మార్కెట్లో ఎక్కువ ధరకు ధాన్యం కొని, తక్కువ ధరకు ప్రభుత్వానికి అమ్మవలసి వచ్చేది. దీనికితోడు సహకార సంఘాలకు రైతు తన ధాన్యాన్ని విక్రయించదలచుకుంటే, అతనికి మార్కెట్ ధరకన్న తక్కువ ధర చెల్లించేవారు. ఇది రుణపరిష్కారసంఘాల విషయం. ఇవి కొంతవరకు వడ్డీరేట్లను తగ్గించినమాట నిజమే. కాని ప్రభుత్వం ప్రత్యామ్నాయంగా రుణాలివ్వనందున వడ్డీ వ్యాపారస్తులు తక్కువ మొత్తాన్ని చేతికిచ్చి, ఎక్కువ మొత్తాన్ని రుణపత్రాల్లో వ్రాసేవారు.

అంతేగాక, ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనాన్ని నిర్మూలించేందుకు అబ్దుల్లా మంత్రివర్గం కఠినచర్య లేవీ తీసుకోలేదు.

ఈ కారణాలన్నిటివల్ల కాశ్మీర్ ప్రజల్లో అసంతృప్తి వ్యాపించింది. "క్విట్ కాశ్మీర్" ఉద్యమంలో వీరోచితంగా పోరాడి, దాడియాకలను ప్రతిఘటించి, జాతీయ మహాసభ నాయకులు అధికారంలోకి రావడానికి తోడ్పడ్డ కాశ్మీర్ ప్రజలు ఆశాభంగం చెంద నారంభించారు.

ఈ పరిస్థితిని అభివృద్ధినిరోధకులు చక్కగా వినియోగించుకున్నారు.

1952 తొలిరోజుల్లో కాశ్మీర్ రాజ్యాంగ నిర్ణయసభ, భూస్వాముల అదనపు భూమిని స్వాధీనపరచుకున్నందుకు నష్టపరిహారం యివ్వనవసరంలేదని తీర్మానించింది. మహారాజాపన్న పారంపర్య హక్కును రద్దుచేస్తూ ఇంకొక తీర్మానంచేసింది. ఈ రెండుచర్యలు భూస్వామ్యవర్గాలను కంగారుపెట్టాయి. ప్రజాపరిషత్తుపేరుతో స్థాపించబడ్డ మతవాద సంస్థ యీ రెండు నిర్ణయాలను వ్యతిరేకిస్తూ ప్రచారం ప్రారంభించింది. భారత రాజ్యాంగచట్టం 31 వ సెక్షన్ ప్రకారం భూస్వాములకు నష్టపరిహారమిచ్చి తీరాలనీ, కాశ్మీర్ రాజ్యాంగసభ యిందుకు విరుద్ధమైన తీర్మానం చేసిందనీ వీరు వాదించారు. అంతేకాదు. భారత రాజ్యాంగం 238 వ సెక్షన్ ప్రకారం రాజప్రముఖుల వ్యవస్థ గుర్తించబడిందనీ, తద్విరుద్ధంగా కాశ్మీర్ రాజ్యాంగ నిర్ణయసభ తీర్మానించిందనీ వీరు ప్రచారం ప్రారంభించారు. భారత రాజ్యాంగం నిర్దేశిస్తున్నట్లుగా భూస్వాములకు పూర్తి నష్టపరిహారం యివ్వాలనీ, రాజప్రముఖ్‌ల వ్యవస్థను గుర్తించాలనీ పట్టుపట్టారు. ఇది జరగాలంటే భారత రాజ్యాంగచట్టాన్ని కాశ్మీర్‌కి పూర్తిగా వర్తింపచేయాలన్నారు. లేదా కనీసం జమ్మూ, లడక్ రాష్ట్రాలను ఇండియన్ యూనియన్‌లో సంలీనంచేసి, వాటిని 'బి' తరగతి రాష్ట్రాలుగా చేయాలన్నారు.

వీరి ఆందోళనను అకాలీపార్టీ, జనసంఘం, హిందూమహాసభ బలపరిచాయి.

జాతీయ మహాసభ నాయకులిందు కంగీకరించలేదు. కాశ్మీర్‌ని పాక్షికంగానే సంలీన మొనర్చడానికి వారు తీర్మానించారు. అంటే, రక్షణ- విదేశ వ్యవహారాలు- రవాణాతప్ప మిగతా శాఖలన్నిటిపైన కాశ్మీర్‌కిసర్వాధికారం ఉండాలన్నమాట. ఈ వాదనను మొదట్లో భారతప్రభుత్వం అంగీకరించలేదు. కాని కాశ్మీర్ ప్రజా ఉద్యమానికిగల బలాన్నిబట్టీ, ఆనాటి ప్రత్యేక పరిస్థితుల్నిబట్టీ ఒప్పుకోవలసి వచ్చింది. తదనుగుణ్యంగా 1952 లో కాశ్మీర్, ఇండియా ప్రభుత్వాల ప్రతినిధులు ఢిల్లీలో ఒకఒడంబడిక చేసుకున్నారు. అంతరంగిక వ్యవహారాల్లో కాశ్మీర్‌కి సర్వాధికారా లివ్వడానికి ఇండియా ప్రభుత్వం అంగీకరించింది.

ఈ సందర్భంలో, ప్రజాపరిషత్తు ఆందోళనకు ప్రభుత్వం లొంగియుంటే ఎంత ప్రమాదం వాటిల్లేదో మనం గుర్తించవలసియుంది. చాలకాలంగా కాశ్మీర్ ప్రజలకు వాగ్దానం చేయబడిన భూ సంస్కరణలను నిరాకరించియుంటే, వారిలో అసంతృప్తి పెరిగి సామ్రాజ్యవాదుల కుట్రల నెదుర్కొనగల మనోనిబ్బరం సన్నగిలేది. రెండవది, కనీసం జమ్మూ - లడక్ రాష్ట్రాలనైనా ఇండియాలో సంలీనం చేయాలనీ, కాశ్మీర్ లోయ విషయం తర్వాత చూచుకోవచ్చుననీ ప్రజా పరిషత్తు వారు కోరిన కోర్కె ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదులకెంతో సంతోషం కలిగించింది. ఎందుచేతంటే, ఆనాడు వారు కూడా మధ్యవర్తిత్వం పేరుతో కోరుతూన్నది యిదే. జమ్మూ - లడక్ రాష్ట్రాలను ఇండియాతో కలిపివేసి, పశ్చిమాన ఉన్న ముస్లిం మెజారిటీ ప్రాంతాన్ని పాకిస్తాన్‌తో కలిపివేసి, రెండిటి మధ్యఉన్న కాశ్మీర్‌లోయను జనవాక్య సేకరణ పేరుతో తమ పెత్తనంక్రిందికి తెచ్చుకోవాలని వారు ఉవ్విళ్ళూరుతున్నారు. సర్ ఓవెన్ డిక్సన్ తయారు చేసిన పథకం ఇలాంటిదే. అందుచేత ప్రజా పరిషత్తు జరిపిన ఆందోళనను లెక్కచేయకుండా, కాశ్మీర్ - ఇండియా నాయకులు కలిసి ఒడంబడిక చేసుకోడం సామ్రాజ్యవాదుల కుట్రకు ఒక దెబ్బ; కాశ్మీర్ ప్రజాతంత్ర ఉద్యమానికి ఒక విజయం.

అయినప్పటికీ ప్రజాపరిషత్తు నాయకులు ప్రజల అసంతృప్తిని వినియోగించుకొని, కొంతకాలంపాటు ప్రజాస్వామ్య బురఖాతో నాటక మాడగలిగారనే విషయాన్ని మనం మరువకూడదు.

ఢిల్లీ ఒడంబడికవల్ల ప్రజాస్వామ్య ఉద్యమం బాగా బలపడ్డంచూచి, ప్రజాపరిషత్తు నాయకులు తమ ఎత్తుగడలను మార్చారు. రాజ్యాంగసభ నిర్ణయాలను బాహాటంగా వ్యతిరేకించడం మానుకుని "ఒకే అధ్యక్షుడు, ఒకే రాజ్యాంగం, ఒకే పతాకం" అనే క్రొత్తనినాదాన్ని చేబట్టారు.

"ఒకే అధ్యక్షుడు" అనే మాటకు వీరి అర్థం ఏమంటే: రాజ్యాంగసభ నిర్ణయించినట్లుగా, ఎన్నుకోబడే అధ్యక్షుడుకాక రాజప్రముఖ్ కాశ్మీర్‌కి అధిపతిగా వుంటాడు. అతడు భారత రాష్ట్రపతికి లోబడి పరిపాలన సాగిస్తాడు. ఈ విధంగా ప్రజాపరిషత్తు నాయకులు కాశ్మీర్ రాజ్యాంగసభ తీర్మానాన్ని తూట్లు పొడవ దలిచారు.

"ఒకే రాజ్యాంగం" అనే మాటకు వీరి అర్థం యిది: కాశ్మీర్ రాజ్యాంగ నిర్ణయసభ ప్రత్యేక రాజ్యాంగాన్ని తయారుచేయడానికి హక్కు కలిగిలేదు. ఒకవేళ అలా తయారుచేయదలిస్తే భారత రాజ్యాంగాన్నే - ఉన్నది ఉన్నట్లు - అనుకరించాలి. దీని అర్థం భారత రాజ్యాంగంలోవున్న కీలకమైన క్లాజులను - ముఖ్యంగా 31,238 క్లాజులను యథాతథంగా కాశ్మీర్‌కి వర్తించేటట్లు చేయడం. అంటే రాచరిక ప్రభుత్వాన్ని నిలబెట్టడం, భూస్వాములకు నష్టపరిహారం చెల్లించడం అన్నమాట.

"ఒకే పతాకం" అనే మాటకు అర్థం: కాశ్మీర్ ప్రజా వుద్యమం వ్యాప్తిలోకి తెచ్చిన జండాను తీసివేసి ఇండియన్ యూనియన్ పతాకాన్ని వ్యాప్తిలోకి తేవడం. మహారాజు పరిపాలిస్తున్న కాలంలోవున్న పతాకానికి ఎట్టి ఆక్షేపణ తెల్పని ప్రజాపరిషత్తు యిప్పుడు త్రివర్ణ పతాకంమీద అకస్మాత్తుగా భక్తివిశ్వాసాలను ప్రకటించడంలో అంతరార్థమేమిటో సులభంగానే తెలుసుకోవచ్చు.

ప్రజాపరిషత్తు నాయకులు "ఒకే అధ్యక్షుడు, ఒకే రాజ్యాంగం, ఒకే పతాకం" అనే ఈ నినాదంతో ఊరేగింపులు, బహిరంగ సభలు జరపడం ప్రారంభించారు. సరిగ్గా యిదే సమయంలో - 1952 నవంబరు 6 న - భద్రతాసమితిలో బ్రిటిష్ ప్రతినిధి సర్ గ్లాడ్విన్‌జబ్ కాశ్మీర్ విభజనను కోరుతూ తన తీర్మానం ప్రతిపాదించాడు. అనేక అమెరికన్ పత్రికలు తమ సంపాదకీయాల్లో ఈ కోర్కెను బలపరిచాయి. బ్రిటన్, అమెరికాల పథకంప్రకారం, ఆజాద్ కాశ్మీర్ పాకిస్తాన్‌కీ, జమ్మూ - లడక్ రాష్ట్రాలు ఇండియన్ యూనియన్‌కీ ఇచ్చివేసి, మధ్యనున్న కాశ్మీర్ లోయపై ఐ. రా. స. ఆధిపత్యాన్ని నెలకొల్పడం. ఈ విధంగా సామ్రాజ్యవాదుల పథకం, ప్రజాపరిషత్తు ఆందోళన ఇంచుమించు ఒకే నినాదంపై ఆధారపడ్డంవల్ల కాశ్మీర్, భారత ప్రభుత్వాలు ప్రజాపరిషత్తు ఉద్యమాన్ని తీవ్రంగా నిరసించాయి.

తర్వాత అమెరికా ఏజంట్లు కాశ్మీర్ ప్రభుత్వంలోని అబ్దుల్లా వర్గాన్ని చేరదీసి, కాశ్మీర్ లోయను "స్వతంత్ర" భూభాగంగా రూపొందించే కొత్త పథకాన్ని తయారుచేశారు. దాని ప్రకారం ఆజాద్ కాశ్మీర్ పాకిస్తాన్‌లోను, జమ్మూ - లడక్ ఇండియాలోను చేరిపోయినతర్వాత, కాశ్మీర్ లోయ ఐక్యరాజ్య సమితిచే "స్వతంత్ర" భూభాగంగా గుర్తింపబడుతుంది. ఇండియా, పాకిస్తాన్‌లుకూడా యీ హోదాను గుర్తించేటట్లు చూస్తుంది. అలా రూపొందే "స్వతంత్ర" కాశ్మీర్‌కి అమెరికా ఆర్థికసహాయం చేస్తుంది.

ఆంగ్లో- అమెరికన్ సామ్రాజ్యవాదులు 1946 నుంచీ కాశ్మీర్‌లోయను తమ సైనిక స్థావరంగా చేసుకొని, సోవియట్, చైనాలమీద దురాక్రమణ జరపడానికి దాన్ని ఉపయోగించుకో జూస్తున్నారనే విషయం ఈ సందర్భంలో జ్ఞాపకముంచుకోవాలి. భద్రతా సమితిలో ఆంగ్లో- అమెరికన్ కూటమి యిట్టి పథకాన్నే ఒకదాన్ని తయారుచేసి, దాన్ని భారత ప్రభుత్వంచే అంగీకరింపజేయ

దానికి ప్రయత్నించి విఫలులయారు. ఇప్పుడు అబ్దుల్లా యెదుట వీరుచేసిన సూచనలోని అంతరార్థంకూడా యిదే. కాశ్మీర్‌లోయ యొక్క "స్వతంత్ర" ప్రతిపత్తిని ఐక్యరాజ్యసమితి గుర్తించడమంటే అర్థం, ఆ ప్రాంతం తమ చెప్పు చేతల్లో ఉండే అస్వతంత్రదేశంగా తయారు కావడంతప్ప వేరుకాదు. దాన్ని తమ ఆక్రమణక్రింద ఉంచుకొంటే భారత ప్రభుత్వం తమవిదేశాంగ విధానాన్ని అనుసరించేటట్లు ఒత్తిడి తీసుకురావచ్చునని కూడా వారు ఉద్దేశించారు.




న్యూయార్కు టైమ్సు పత్రిక 1953 జూలై 5 సంచికలో
ప్రచురింపబడ్డ చిత్రపటం

1953 మే మాసంలో అమెరికన్ విదేశాంగమంత్రి డల్లెస్ ఢిల్లీ, కరాచీలకు వచ్చినప్పుడు ఈ "స్వతంత్రకాశ్మీర్" స్కీముకు ఉభయ ప్రభుత్వాలముందు ఉంచినట్లు "న్యూయార్క్ టైమ్స్" అను అమెరికన్ పత్రిక జులై 5 సంచికలో బయటపెట్టింది. అదేరోజున యీ పత్రిక కాశ్మీర్ చిత్రపటా న్నొకదాన్ని ప్రకటించింది. అందులో కాశ్మీర్ మూడు భాగాలుగా విభజింపబడింది :

1. ఆజాద్ కాశ్మీర్. 2. జమ్మూ-లడక్. 3. కాశ్మీర్ లోయ.

( 44 వ పేజీలోని పటము చూడండి )

ఈ పథకాన్ని ఏ పరిస్థితుల్లో షేక్ అబ్దుల్లా అంగీకరించాడో తెలుసుకోడం అవసరం.

అబ్దుల్లా మంత్రివర్గం అధికారంలోకి వచ్చాక, కొన్ని అభ్యుదయకరమైన సంస్కరణలను ప్రవేశపెట్టినమాట వాస్తవమే. కాని వాటిని అమలు జరపడంలో ప్రజల చొరవను ప్రోత్సహించక పోవడమేగాక, నిరంకుశాధికారులపైనే ప్రధానంగా ఆధారపడుతూ వచ్చింది. తత్ఫలితంగా, ఆ సంస్కరణలవల్ల ప్రజలు లాభం పొందలేదు. కొన్ని ప్రాంతాల్లో - ఉదాహరణకు కాశ్మీర్ లోయలోని బడగాం తాలూకా - ప్రజలు చొరవ చూపినప్పుడల్లా వారిపై నిర్బంధ విధానం అమలు జరపబడింది. గ్రామ సీమల్లో భూస్వాములు, వడ్డీ వ్యాపారస్తులు ప్రభుత్వ శాసనాలను బాహాటంగా ఉల్లంఘించారు. పన్నులభారంగాని, ఋణభారంగాని, నిర్బంధ ధాన్యసేకరణగాని రద్దుకాలేదు. ఈ కారణాలవల్ల అబ్దుల్లా మంత్రివర్గం ప్రజలనుంచి దూరమైంది. ఆంగ్లో - అమెరికన్ కుట్రలను ప్రతిఘటించడానికి సైతం ప్రజల్ని సమీకరించడంలో తన కర్తవ్యాన్ని నెరవేర్చలేదు. ఈ పొరపాట్లను గుర్తించి, తన విధానాన్ని మార్చుకోడానికి బదులు మంత్రి మండలిలోని అబ్దుల్లావర్గం ప్రజల దృష్టిని వక్రమార్గాల్లో పెట్టడానికి "స్వతంత్ర" కాశ్మీర్ అనే నినాదాన్ని చేబట్టింది. ఈ వాస్తవాన్ని అమెరికన్ వ్యాఖ్యాతలు బాహాటంగానే అంగీకరించారు. 1953 జూలై 5 వ తేదీ "న్యూయార్క్ టైమ్స్"లో రాబర్ట్ ట్రంబుల్ అనే వ్యాఖ్యాత యిలా వ్రాశాడు :

"షేక్ అబ్దుల్లా స్వతంత్ర హోదాను కోరడానికి కారణమేమంటే, అతనెదుర్కొంటున్న అనేక సమస్యలు - రాజకీయమైనవి, ఆర్థికమైనవి కూడా - దాని ద్వారా పరిష్కరింపబడతాయని అతడు విశ్వసించాడు. తద్వారా అతని వ్యక్తిగత పలుకుబడి పెరుగుతుంది. ఇప్పుడాపలుకుబడి పోతున్నట్లు కనిపిస్తోంది."

నిజానికి, సామ్రాజ్యవాదులు యీనినాదంతో అబ్దుల్లాను బుట్టలో వేసుకోడానికి కొంతకాలంనుంచీ ప్రయత్నిస్తూనే వచ్చారు.

1950 లో అమెరికా రాయబారి లాయ్ హెండర్సన్ అబ్దుల్లాను స్వయంగా కలుసుకుని, "స్వతంత్ర" కాశ్మీర్‌వల్ల కలిగే "లాభాలను" గురించి నచ్చజెప్పడానికి

తీవ్రమైన ప్రయత్నంచేశాడు. అమెరికన్ డాలర్లు పుష్కలంగా లభిస్తాయని హామీ యిచ్చాడు.

1951 తర్వాత "మాంచెస్టర్ గార్డియన్," డెయిలీ టెలిగ్రాఫ్" మొదలైన బ్రిటిష్ పత్రికలు, "వాషింగ్టన్‌పోస్టు" వంటి అమెరికన్ పత్రికలు అబ్దుల్లాయొక్క గుణగణాలను స్తుతిస్తూ అనేక వ్యాసాలు ప్రకటించాయి. ఐ. రా. స. ప్రతినిధి ఫ్రాంక్ గ్రాహంగాని, భద్రతాసమితిలో సభ్యులైన బ్రిటిష్ - అమెరికన్ ప్రతినిధులుగాని అబ్దుల్లా మంత్రివర్గాన్ని తమ శత్రువుగా చిత్రించడం మానివేశారు.

సామ్రాజ్యవాదుల ఎత్తుగడల్లో వచ్చిన యీ మార్పు "చక్కని" ఫలితాలనే యిచ్చింది. 1951 జూన్‌లో ఐ. రా. స. ప్రతినిధి గ్రాహం కాశ్మీర్ వచ్చినప్పుడు విద్యార్థులు అసమ్మతిప్రదర్శనలు జరపగా, వాటిని ప్రభుత్వం క్రూరంగా అణచివేసింది. అనేకమంది విద్యార్థుల్ని అరెస్టుజేసి జైళ్ళలో నిర్బంధించింది. జూలైలో విముక్త చైనానుంచి పారిపోయి వచ్చిన కొమింటాంగ్ సైనికులకు, సైనికోద్యోగులకు అబ్దుల్లా కాశ్మీర్ లోయలో ఆశ్రయం ఇచ్చాడు.

1951 నవంబరు 5 న షేక్ అబ్దుల్లా కాశ్మీర్ రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రారంభోపన్యాసమిస్తూ, కాశ్మీర్ సమస్యను పరిష్కరించ డానికి మూడు మార్గాలను సూచించాడు. అందులో మూడవది కాశ్మీర్ లోయను "స్వతంత్ర" రాజ్యంగా చేయడం.

1952 జనవరిలో అబ్దుల్లా పారిస్‌లో ఉన్నప్పుడు అనేక పశ్చిమరాజ్యాల ప్రతినిధు లతన్ని కలుసుకొని, "స్వతంత్ర" కాశ్మీర్ పథకాన్ని అంగీకరింపజేయ డానికి ప్రయత్నాలు చేశారు. వాటిఫలితంగా కాశ్మీర్ ప్రధాని వారితో రహస్య సంబంధా లేర్పరచుకొన్నాడు.

1952 మార్చిలో అతడు రాజ్యాంగనిర్ణయ సభలో ఉపన్యసిస్తూ, కాశ్మీర్ సమస్యయెడల పశ్చిమరాజ్యాల వైఖరిలో మార్పువచ్చిందనీ, "వాస్తవపరిస్థితుల కనుగుణ్యంగా" వారు ఆలోచిస్తున్నారనీ కొనియాడాడు. మార్చి 23 న ఉపన్యసిస్తూ, కాశ్మీర్ భారతదేశంలో పూర్తిగా సంలీనం కానప్పుడు జరిగేది "పూర్వపు హోదానే కలిగియుండడం" అంటూ పరోక్షంగా "స్వతంత్ర" ప్రతిపత్తిని సమర్థించాడు.

1952 ఏప్రిల్‌లో షేక్ అబ్దుల్లా రణవీర్‌సింగ్ పురాలో ఉపన్యసిస్తూ, కాశ్మీర్ ఇటు ఇండియా పెత్తనాన్నిగాని, అటు పాకిస్తాన్ పెత్తనాన్నిగాని కోరడంలేదనీ, స్వతంత్ర ప్రతిపత్తి దానికుండాలనీ స్పష్టంగా తెలియజేశాడు.

1952 డిసెంబరు 19 న "క్రిస్టియన్ సైన్స్ మానిటర్" అనే అమెరికన్ పత్రిక విలేఖరితోమాట్లాడుతూ అబ్దుల్లా యిట్టి అభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు.

1953 మే నెలలో అడ్లెయ్ స్టీవెన్సన్ అను అమెరికన్ రాజకీయవేత్త మూడురోజులు వరుసగా అబ్దుల్లాతో రహస్య సంప్రతింపులుజరిపి, ఢిల్లీలోని

అమెరికన్ రాయబార కార్యాలయంలో ఒక నివేదికను సమర్పించాడు. అందులో అబ్దుల్లా "మాటవరుసకు" ఒక సూచనచేస్తూ, "స్వతంత్ర ప్రతిపత్తి ఒక పరిష్కార మార్గమ"ని చెప్పినట్లు పేర్కొన్నాడు. ఈ విషయాన్ని "టైమ్స్‌ఆఫ్ ఇండియా" సెప్టెంబరు 15 న (1953) బయటపెట్టింది.

స్టీవెన్సన్‌తో అబ్దుల్లా రహస్య సంప్రతింపులు జరిపిన తర్వాత, జాతీయ మహాసభ కార్యవర్గం సమావేశమైంది. అందులో షేక్ అబ్దుల్లా తన అభిప్రాయా లను మార్చుకున్నట్లు, ఇండియాతో కలయికకు తా నిష్టపడ్డంలేనట్లు, ఉభయ ప్రభుత్వాలమధ్య జరిగిన ఢిల్లీ ఒప్పందాన్ని తాను వ్యతిరేకిస్తున్నట్లు బాహాటంగా తెలియజేశాడు. 1953 మే 18 న అతడు "స్వతంత్ర" కాశ్మీర్ పథకాన్ని ఒక సమగ్రరూపంలో కార్యవర్గం ముందుంచాడు. కాని, అధికసంఖ్యాకులు దాన్ని వ్యతిరేకించారు. అయినా లెక్కచేయక, అనేక సమావేశాల్లో తన వాదనను సమర్థించుకొంటూ ఉపన్యాసాలివ్వడం ప్రారంభించాడు. ఈ ఉపన్యాసాల్లో అతడు ఇండియా - పాకిస్తాన్‌లతో "స్వతంత్ర" కాశ్మీర్ స్నేహసంబంధా లుంచుకుంటుందని చెబుతూ వచ్చినా, అమెరికన్ అధికారులతో ఎప్పటికప్పుడు రహస్య సంప్రతింపులు సాగిస్తూనే ఉన్నాడు.

"స్వతంత్ర" కాశ్మీర్ నినాదంలోని ప్రమాదాన్ని గ్రహించిన యితర నాయకులు బహిరంగసభల్లో అబ్దుల్లాకు వ్యతిరేకంగా ఉపన్యాసాలివ్వనారంభిం చారు. కాశ్మీర్ రాజ్యాంగ నిర్ణయసభ అధ్యక్షుడు జి. ఎం. సాదిక్ జూలై 19 న బడగాం సభలో ఉపన్యసిస్తూ, "స్వతంత్ర" కాశ్మీర్ ఎల్లప్పుడూ విదేశ దాడుల ప్రమాదాన్నెదుర్కోవలసి వస్తుందని స్పష్టం చేశాడు. జూలై 25 న ఉపప్రధాని బక్షీ గులాం మహమ్మద్‌కూడా కుల్గామ్ సభలో ఉపన్యసిస్తూ ఈ ప్రమాదాన్ని ఎత్తి చూపాడు.

ఇట్టి పరిస్థితుల్లో, షేక్ అబ్దుల్లా 1953 ఆగస్టు 9 న మంత్రివర్గంనుంచి బర్తరఫు చేయబడి జైల్లో నిర్బంధింప బడ్డాడు. బక్షీగులాం మహమ్మద్ ప్రధా నిగా కొత్తమంత్రివర్గం ఏర్పడింది.

ఈ చర్య ఆంగ్లో-అమెరికన్ వర్గాల్లో గాబరాపుట్టించింది. తమ పన్నాగం తలక్రిందులైనందుకు వారు గంగవెర్రు లెత్తారు.

షేక్ అబ్దుల్లా అరెస్టుచేయబడిన వార్త కాశ్మీర్‌ప్రజల్లో తీవ్రసంచలనం కలిగించింది. అతడు చేపట్టిన మార్గమెంత ప్రమాద భరితమైనదో తెలియజెప్ప డానికి జాతీయ మహాసభ నాయకులు తగినంత శ్రద్ధతీసుకోనందున, అంతవరకూ జాతీయనాయకుడుగా పరిగణింపబడ్డ అబ్దుల్లా అరెస్టయ్యాడనే వార్త తెలియగానే ప్రజలు చాలచోట్ల అసమ్మతి ప్రదర్శనలు జరిపారు. ఈ పరిస్థితిని ఐ. రా. స. పరిశీలకులు, సామ్రాజ్యవాద ఏజంట్లు చక్కగా వినియోగించుకున్నారు. జాతీయ

మహాసభ కార్యకర్తల్లోసైతం సరియైన అవగాహన లేకపోవడంవల్ల చాల అసమ్మతి ప్రదర్శనల్లో పాల్గొన్నారు.

ఈ పరిస్థితినంతటినీ పర్యాలోకించేందుకు, జాతీయ మహాసభ అత్యవసర సదస్సు శ్రీనగర్‌లో జరిగింది. అన్ని ప్రాంతాల నుంచి 3000 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అనేకమంది వేదిక నెక్కి ప్రజల అవస్థలను వర్ణించుతూ వుపన్యాసాలిచ్చారు. భూస్వాముల, షావుకార్ల, నిరంకుశోద్యోగుల దుష్టచర్యలను వివరించారు. చాలమంది కార్యకర్తల్లో స్వార్థం, ముఠాతత్వం, పెత్తందారీ పద్ధతులు యెలా ప్రబలుతున్నాయో నిరూపించారు. సదస్సు ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానంలో ఈ అవలక్షణాలన్నీ నిరసింపబడ్డాయి. వెంటనే కార్యకర్తలంతా నెరవేర్చవలసిన కర్తవ్యాలు కొన్ని తీర్మానంలో రూపొందింపబడ్డాయి. సామ్రాజ్యవాద కుట్రలకు కాశ్మీర్ బలికాకుండా కాపాడేందుకు అప్రమత్తతతో వ్యవహరించాలనీ, బ్రిటన్-అమెరికాల పన్నాగాలను ప్రజలకు తెలియజెప్పాలనీ తీర్మానం విజ్ఞప్తి చేసింది.

ప్రజలతో నిత్యసంబంధాలుంచుకోవలసిన అవసరాన్ని తీర్మానం యీ క్రిందివిధంగా వివరించింది :

"ప్రస్తుతం జాతీయమహాసభమీద ఒక పెద్ద బాధ్యత ఉంది. నేటి యథార్థ పరిస్థితిని అది గమనించాలి. సంస్థయావత్తూ ప్రజల నిత్యజీవితంతో సన్నిహిత సంబంధం పెట్టుకోవాలి. అదే సమయంలో వారి పరిస్థితిని బాగుపరిచేందుకది బలీయమైన సాధనంగా ఉపయోగపడాలి....ఇంతవరకు ప్రభుత్వం నియంతృత్వ పద్ధతుల్లో వ్యవహరించడంవల్ల, అది ప్రజలకు దూరమైంది. ప్రజల అభిప్రాయాలను తెలుసుకోడంలో నిర్లక్ష్యం చేసింది. కార్యకర్తలు వ్యక్తిగత ప్రాబల్యం సంపాదించడానికి తగువులాటల్లో నిమగ్నులై ప్రజల అవసరాలను, సమస్యలను విస్మరించుతూ వచ్చారు. అందుచేత పరిపాలనాయంత్రం సరిగా పని చేయడంలేదు....ప్రజలు అసంతృప్తిచెంది వున్నారు. గత అనుభవంనుంచి పార్టీ గుణపాఠాలు నేర్చుకొని పరిపాలనాయంత్రాన్ని పునర్వ్యవస్థీకరించి, ప్రజలకు అది నిజంగా సహాయంచేసేటట్లు చూడాలి."

"నూతన కాశ్మీర్" ప్రణాళికలో పేర్కొన్న సంస్కరణలను అమలు జరపడానికి కొత్తప్రభుత్వం చర్యలు తీసుకోవాలనికూడా తీర్మానం ఆదేశించింది.

ఈ సదస్సుకు హాజరైన ప్రతినిధులంతా ఒక కొత్త అవగాహనతో తమతమ ప్రాంతాలకు తిరిగి వెళ్లారు. ప్రాంతీయ సమావేశాల్లోను, బహిరంగ సభల్లోను పై తీర్మానాన్ని వివరించడం మొదలుపెట్టారు. చాలమంది అగ్రనాయకులు యిట్టి సమావేశాలకు, బహిరంగ సభలకు స్వయంగా వెళ్ళారు.

దీనితోబాటు కొత్త ప్రభుత్వం ప్రజల కిష్టాలను తొలగించడానికి కొన్ని ప్రాథమికచర్యలు తీసుకుంది. ఉదాహరణకు నిర్బంధ ధాన్యసేకరణ పూర్తిగా రద్దు చేయబడింది. రైతుల అవసరాలు తీరగా మిగిలే ధాన్యాన్ని మాత్రమే,

వారి అంగీకారంమీద ప్రభుత్వం కొంటుందని ప్రకటింపబడింది. అట్టి ధాన్యా నికి ధర 'ఖిర్వార్' ఒకటికి రు 10 అని నిర్ణయించింది. ఇది పూర్వపు ధరకంటె రు. 1 హెచ్చు. ఈ సొమ్మును అప్పటికిప్పుడు ఒకే వాయిదాలో చెల్లించివేయ డాని కంగీకరించింది. రాజధానినగరమైన శ్రీనగర్‌లో రేషన్ బియ్యం ఒక్కొక్క వ్యక్తికి మొదట 3 సేర్లు, (కాశ్మీర్ సేరు మన సేరుకంటె చిన్నది) తర్వాత మరో మూడుసేర్లు అధికంగా యివ్వడానికి ఉత్తర్వులు జారీఅయాయి. వాటి ఖరీదును ప్రభుత్వం తగ్గించింది. ప్రాథమికవిద్య లగాయతు యూనివర్సిటీ విద్య వరకు ఉచిత విద్యాసౌకర్యం యేర్పాటుచేసింది. తక్కువ జీతాల ఉపాధ్యాయు లకు ఎక్కువ జీతాలు మంజూరు చేసింది.

ఇవన్నీ సక్రమంగా అమలు జరిగేటట్లు జాతీయ మహాసభ కార్య కర్తలు తగు జాగ్రత్తలు తీసుకున్నారు. కొన్నాళ్ళకు వారు తిరిగి ప్రజలతో సన్ని హిత సంబంధా లేర్పరచుకోగలిగారు. ప్రజలలో - ముఖ్యంగా రైతుల్లో - తిరిగి ఉత్సాహం వచ్చింది. నాయకులయెడ గౌరవం ఏర్పడింది. పరిస్థితుల్లో వచ్చిన యీ మార్పు కార్యకర్తలను ఉత్తేజపరిచింది. వారు మరింత ఆత్మవిశ్వా సంతో పనిచేయ నారంభించారు.

ఇట్టి అనుకూల వాతావరణంలో కాశ్మీర్ రాజ్యాంగ నిర్ణయసభ, భారత దేశంలో సంలీనాన్ని ధృవపరుస్తూ తీర్మానంచేసింది. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ఢిల్లీ ఒడంబడికను అధికారయుతంగా ఆమోదిస్తూ ఒక ప్రకటనచేశారు. దాని ప్రకారం, కాశ్మీర్ ప్రజలు ప్రత్యేకంగా రాజ్యాంగచట్టాన్ని రూపొందించుకో వచ్చు. భూస్వాములకు నష్టపరిహార మిచ్చితీరాలనే నిబంధన కాశ్మీర్‌కి వర్తించదు. అలాగే మంత్రివర్గాన్ని, అధ్యక్షుణ్ణి నియమించడంలో కాశ్మీర్ సొంతసూచనలు చేయవచ్చు. అధ్యక్షుణ్ణి శాసనసభ ఎన్నుకొంటుంది; రాష్ట్రపతి ఆ ఎన్నికను ధృవపరుస్తాడు. రాష్ట్రపతికి గల అసాధారణాధికారాలు కాశ్మీర్‌కి వర్తించవు. భూసమస్యకు సంబంధించిన ఏ శాసనాన్నైనా, రాష్ట్రపతి ఆమోదం అక్కర లేకుండా, శాసనసభ ఆమోదించవచ్చు.

ఈ నిర్ణయాలు కాశ్మీర్ ప్రజలకు కొంత సంతృప్తి నిచ్చాయి.

తర్వాత క్రమానుగతంగా యీ క్రింది చర్యలు తీసుకోబడ్డాయి.

కాశ్మీర్‌లో చిరకాలంనుంచీ అమల్లోవున్న దిగుమతి సుంకాలను కొత్త ప్రభుత్వం రద్దుచేసింది. ఇందువల్ల జీవితావసర వస్తువుల ధరలు తగ్గాయి. ఈ సందర్భంలో మనం జ్ఞాపకముంచుకోవలసిన విషయమేమంటే, ఏటా కాశ్మీర్ ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో సగానికి పైగా దిగుమతి సుంకాలవల్లనే లభిం చేది. ఉప్పు, పంచదార, తేయాకు, కిరసనాయిలు, బట్ట మొదలైన వాటిమీద ప్రభుత్వం విధించే దిగుమతి సుంకాలు విపరీతంగా ఉండడంవల్ల ఆ భారం అంతా కొనుగోలుదార్లమీద పడేది. ఇప్పుడివి రద్దుకావడంతో అన్ని సరుకులూ పూర్వంకంటె చౌకగా లభిస్తున్నాయి.

ఆహారధాన్యాల ఉత్పత్తిని పెంచేందుకు ప్రభుత్వం 18,000 యకరాల భూమికి అదనంగా నీటిపారుదల సౌకర్యాలను కలుగజేసింది. అబ్దుల్లా మంత్రివర్గం హెచ్చించిన నీటితీరువా రేట్లు తగ్గింపబడ్డాయి. మొదటి పంచవర్ష ప్రణాళిక క్రింద 1953-'54 లో వేర్వేరు అభివృద్ధిపథకాలకు రు. 1 కోటి 15 లక్షలు ఖర్చుచేయబడ్డాయి.

ప్రాథమికవిద్య మొదలు యూనివర్సిటీ విద్యవరకు ఉచితంగా బోధించడానికి నిర్ణయించడంతోబాటు, ప్రభుత్వం విద్యాలయాల సంఖ్యను 100 కి 40 చొప్పున హెచ్చించింది. అబ్దుల్లా మంత్రివర్గంచే గ్రాంట్లు రద్దుచేయబడ్డ ఎయిడెడ్ పాఠశాలలకు తిరిగి గ్రాంట్లు మంజూరయాయి. బడ్జెట్ లో విద్యాశాఖ క్రింద ఖర్చు హెచ్చుచేయబడింది. మొత్తం 1 లక్షా 50 వేల విద్యార్థులకు నేడు ఉచిత విద్యా సౌకర్యం లభిస్తోంది.

మధ్యతరగతికి చెందిన ప్రభుత్వోద్యోగుల జీతాలను పెంచడానికి ఏటా రు. 50 లక్షలు కేటాయింపబడుతున్నాయి.

సహకార సంస్థలు కొత్త పద్ధతుల్లో నిర్వహింపబడుతున్నాయి. పేదలు చెల్లించుకోవలసిన అప్పులు రు. 36 లక్షలవరకు రద్దుచేయబడ్డాయి. గ్రామసీమల్లో రుణాలిచ్చేందుకు ప్రభుత్వం రిజర్వు బ్యాంకునుంచి రు. 35 లక్షలు అప్పుగా తీసుకోడానికి ప్రయత్నిస్తోంది.

చేతిపరిశ్రమలకు కొంతవరకు ధనసహాయం, రవాణా సౌకర్యాలు, మార్కెటింగ్ ఏర్పాట్లు జరుగుతున్నాయి. వివిధ కేంద్రాలలో ప్రభుత్వం 200 ఉత్పత్తి కేంద్రాలను - ఎంపోరియంలను తెరిచింది.

జమ్మూలో ఒక రంగుల ఫ్యాక్టరీ, కాశ్మీర్ లోయలో ఒక తివాసీల కార్ఖానా, శ్రీనగర్ వద్ద ఒక తోళ్ళకార్ఖానా, ఒక జాయినరీమిల్లు కొత్తగా తెరువబడ్డాయి.

ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనాన్ని నిర్మూలించేందుకు శాసనసభ చేసిన తీర్మానాన్ని పురస్కరించుకొని, ప్రభుత్వం ఒక ట్రిబ్యునల్ ను నియమించింది.

ఆర్థికంగా ఎంతో వెనుకబడియున్న లడక్ లో రు. 5 లక్షల ఖర్చుతో ఉన్ని - పట్టు ఉత్పత్తి కేంద్రమొకటి స్థాపించబడింది.

ఈ చర్యలవల్ల ప్రజలస్థితి కొంతవరకు బాగుపడినప్పటికీ, అనేక ప్రధాన సమస్యలు ఇంకా అపరిష్కృతంగానే వున్నాయి. ఉదాహరణకు భూమిపై భూస్వాములకు గల గుత్తాధికారం పూర్తిగా నిర్మూలింపబడలేదు. ప్రభుత్వం గ్రామీణులకు, వృత్తిదారులకు ధారాళంగా అప్పులివ్వజాలనందున వడ్డీవ్యాపారస్తుల దోపిడి పూర్తిగా అరికట్టబడలేదు. చేతివృత్తులవారి వస్తువులకు మార్కెట్ తగినంతగా లేదు. లభించడం కొత్తపరిశ్రమలు చెప్పుకోదగినంతగా స్థాపింపబడనందున నిరుద్యోగ సమస్య యిప్పటికీ తీవ్రంగానే ఉంది.

# 6 వ అధ్యాయం

# ప్రమాద పరిస్థితి

కాశ్మీర్ సమస్య 8½ సంవత్సరాలుగా ఐక్యరాజ్య సమితిలో రావణా సురిడి కాష్టం మాదిరిగా కాలుతోంది. దీన్ని పరిష్కరించడానికి భద్రతాసమితి ఎట్టి ప్రయత్నం చేయకపోవడమేగాక, అందులో మెజారిటీగావున్న ఆంగ్లో - అమెరికన్ కూటమి తన స్వార్థ ప్రయోజనాలకు దాన్ని వినియోగించుకొంటూ వచ్చింది. వందలాది సైనిక పరిశీలకుల్ని దింపి, యెలాగైనా కాశ్మీర్ని యుద్ధ స్థావరంగా చేసుకోడానికి కుట్రలు పన్నింది. చివరకు అబ్దుల్లాను సైతం వారు తమవైపు తిప్పుకోగలిగారు. ఆనాటి ప్రమాద పరిస్థితుల్లో కాశ్మీర్ నాయకులు, భారత ప్రభుత్వం అప్రమత్తతతో మెలగియుండకపోతే, కాశ్మీర్ ఈ పాటికి సామ్రాజ్యవాదుల వశమైయుండేది.

ఈ 8½ సంవత్సరాల్లోను పాకిస్తాన్ పాలకవర్గం సామ్రాజ్యవాదుల కుట్రలకు బలం చేకూర్చుతూవచ్చింది. పరాయి ప్రభుత్వాల జోక్యం లేకుండా ఈ సమస్యను పరిష్కరించుకుందామని భారతప్రభుత్వం ఎన్నిసార్లు సూచించినప్పటికీ, పాకిస్తాన్ ప్రభుత్వం తృణీకరిస్తూ వచ్చింది.

ఇంతటితో ఆగక, పాకిస్తాన్ పాలకులు సామ్రాజ్యవాదులతో కలిసి ఆగ్నేయాసియా సైనిక కూటమిలో చేరారు. 1954 మే మాసంలో అమెరికాతో సైనిక ఒడంబడిక చేసుకున్నారు. దానిప్రకారం అమెరికానుంచి ఆయుధాలను విపరీతంగా దిగుమతి చేసుకొంటున్నారు. తమ సాయుధదళా లన్నిటినీ అమెరికన్ ఆఫీసర్ల చేతుల్లో పెట్టారు. 1954 నవంబరులో బ్రిటన్, టర్కీ, ఇరాక్, ఇరాన్లతో కలిసి బాగ్దాద్ సైనికకూటమిలో చేరారు. దీనిప్రకారం తమ భూభాగాన్ని, సాయుధ దళాలను, సహజ సంపదను సామ్రాజ్యవాదుల వశం చేశారు. ఈ యుద్ధ కూటము లన్నిటి ఉద్దేశం ఒకటే: ప్రపంచమంతటా పతనమయిపోతున్న వలస దోపిడీని కొత్తరూపంలో కొనసాగించడమే వాటి ఉద్దేశం.

పాకిస్తాన్ ఈ యుద్ధకూటములలో చేరడంవల్ల, దాని ఆర్థికవ్యవస్థ అంతా సైనికసన్నాహాలతో ముడివడిపోయింది. ఉదాహరణకు 1955-56 బడ్జెట్లో పాకి

స్తాన్ 100 కి 70 వంతులు సైనిక ఖర్చులకు కేటాయించవలసి వచ్చింది. తత్ఫలితంగా ప్రజలమీద పన్నులభారం విపరీతంగా పెరిగింది. సామాన్యప్రజల్లో అసంతృప్తి అంతకంతకు తీవ్రమవుతోంది.

ఈ అసంతృప్తిని వక్రమార్గాల్లో తిప్పడానికి పాకిస్తాన్ పాలకులు కాశ్మీర్ సమస్యను ఒక పాచికగా ఉపయోగించుకొంటున్నారు. తాము కాశ్మీర్ ప్రజల ఆర్తరక్షకులవలె నటిస్తున్నారు. జనవాక్య సేకరణద్వారా కాశ్మీర్ సమస్యను పరిష్కరించాలని పదేపదే ప్రకటనలు చేస్తున్నారు.

ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు కోరేదికూడా యిదే.

అబ్దుల్లా అరెస్టుతో తమ ప్లానులు భగ్నమయాయని తెలుసుకొన్న వీరు, పాకిస్తాన్ - భారతదేశాల మధ్య ఉద్రిక్త వాతావరణాన్ని నిత్యమూ పెంచి పోషిస్తున్నారు. అమెరికా పాకిస్తాన్‌కి అంతకంతకు ఎక్కువగా ఆయుధాలను సప్లయిచేయడమేగాక, పాక్ సైనికుల సంఖ్యను ఇండియా సైనికుల సంఖ్యతో సమానంగా పెంచేందుకు పథకాలు తయారుచేశారు. సరిహద్దు ఘర్షణలను రెచ్చగొట్టి, ఉభయ దేశాలమధ్య యుద్ధ వాతావరణాన్ని కలుగజేస్తున్నారు.

సోవియట్ ప్రధాని బుల్గానిన్, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి కృశ్చేవ్ 1955 డిసెంబరులో కాశ్మీర్ సందర్శించారు. డిసెంబరు 10 వ తేదీని కృశ్చేవ్ శ్రీనగర్‌లో ఉపన్యసిస్తూ, యిలా చెప్పారు :

"అసలు కాశ్మీర్ సమస్య ఎలా ఉత్పన్నమైంది? దాన్ని సృష్టించినది ప్రజలుకాదు. వలసవిధానంనుంచి విముక్తిచెంది, విదేశ ప్రభుత్వాల పెత్తనానికి స్వస్తిచెప్పిన దేశాల ప్రజల్లో ద్వేషభావాలను రెచ్చగొట్టడం కొన్ని ప్రభుత్వాలకు లాభదాయకంగా కనిపించింది. ఇలా చేయడంలో గుత్తపెట్టుబడిదారులు తమ ఉద్దేశాలను నెరవేర్చుకుంటున్నారు. ఈ దేశాలను ఇంకా అధికంగా తమ ఆర్థిక పెత్తనంక్రింద ఉంచుకోడానికి, తమ చెప్పుచేతల్లో వాటిని బంధించియుంచడానికి ప్రజల్లో కొందరిని యితరులపైకి ఉసిగొల్పుతున్నారు.

"ఏయే ప్రభుత్వాలు ఎడతెగకుండా కాశ్మీర్ సమస్యను తీవ్రమొనర్చుతున్నాయో ప్రత్యేకంగా నేను పేర్కొనవలసిన అవసరంలేదు. ఎందువల్లనంటే, అది అందరికీ తెలిసినవిషయమే. అంతేగాక, కాశ్మీర్ సమస్యను తీవ్రపరచడంలో యీ ప్రభుత్వాలు తమ ఉద్దేశాలను దాపరికంలేకుండానే చెప్పుకుంటున్నాయి.

"ఒకసారి భద్రతాసమితిలో యీ సమస్యపై చర్చ జరుగుతున్నప్పుడు సోవియట్ ప్రతినిధి స్పష్టమైన భాషలో సోవియట్ దృక్పథాన్ని తెలియజేశాడు. కాశ్మీర్ సమస్యను పరిష్కరించుకోవలసింది కాశ్మీర్ ప్రజలేనని మొదటినుంచీ సోవియట్ యూనియన్ అభిప్రాయపడుతోంది. ఎందుచేతంటే, ప్రజాస్వామ్య సూత్రాలకనుగుణ్యమైన పద్ధతి యిదే. ఈ ప్రాంతంలోని ప్రజల స్నేహసంబంధాలు బలపడ్డానికికూడా యిదేమార్గం.

"సోవియట్ యూనియన్ కాశ్మీర్ సమస్యను నిష్పాక్షిక దృష్టితో పరిశీలిస్తుంది. కాశ్మీర్ ప్రజలపట్ల, వారి శాంతి వాంఛపట్ల, ప్రజాతంత్ర సాంప్రదాయాలపట్ల సోవియట్ ఎల్లప్పుడూ హృదయ పూర్వకమైన స్నేహభావాలనే వ్యక్తంచేస్తూ వచ్చింది. వారిదివరకే భారత రిపబ్లిక్‌లోని అభ్యుదయ శక్తులతోను, శాంతి శక్తులతోను స్నేహ సంబంధా లేర్పరచుకున్నారు. కాశ్మీర్ ప్రజల జాతీయ వాంఛలను వారు చక్కగా అర్థం చేసుకున్నారు.

"కాశ్మీర్ ప్రజలు సామ్రాజ్యవాదుల చేతుల్లో కీలుబొమ్మలుగా ఉండడానికిష్టంలేదని వాస్తవ ఘటనలు రుజువు చేస్తున్నాయి' కాని కొన్ని ప్రభుత్వాలు కోరేది సరిగ్గా యిదే. అవి పాకిస్తాన్ వాదనను బలపరచడానికికూడా కారణం యిదే."

ఏప్రిల్ 2 వ తేదీని ప్రధాని నెహ్రూ పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ, కాశ్మీర్ సమస్యపై సోవియట్ నాయకులు ప్రకటించిన అభిప్రాయాలను హర్షించారు. అవి "న్యాయశాస్త్ర రీత్యా, రాజ్యాంగదృష్ట్యా, ఆచరణ రీత్యా పూర్తిగా సరియైనవే" అని కొనియాడారు.

ప్రస్తుత పరిస్థితి కాశ్మీర్ ప్రజలకేగాక ఇండియా - పాకిస్తాన్ ప్రజలకు కూడ ప్రమాదకరంగా తయారైంది. దీన్ని గుర్తించి, ప్రధాని నెహ్రూ ప్రస్తుత యుద్ధవిరమణ శ్రేణిని ఆధారంగా చేసుకొని, ఉభయ ప్రభుత్వాలూ నిర్యుద్ధ ఒడంబడిక చేసుకోవాలని ఒక సరికొత్త సూచన చేశారు. ఇది భారతదేశ శాంతి వాంఛను తెలియజేస్తుంది.

ఏప్రిల్ 13 న శ్రీ నెహ్రూ ఢిల్లీ బహిరంగసభలో ఉపన్యసిస్తూ, యిలా తెలియజేశారు: "నేను పాకిస్తాన్ నాయకులతో యిలా చెప్పాను: 'మీరు కాశ్మీర్‌లో అనేక అత్యాచారాలు చేశారని నా అభిప్రాయం. అందుచేత కాశ్మీర్ భూభాగంలో తిష్టవేసి కూర్చునేహక్కు మీకులేదు. కాని ఘర్షణలు, కల్లోలం జరగడం నాకిష్టంలేదు. అందుచేత, ప్రస్తుత యుద్ధవిరమణ శ్రేణిని ఆధారంగా చేసుకొని, మీ ఆక్రమణక్రిందవున్న భూమిని మీరే ఉంచుకొనే పద్ధతిపై ఒప్పందం కుదుర్చుకుందాం. దాన్ని మేము యుద్ధంచేసి లాక్కోదలచుకోలేదు."

ప్రస్తుతపరిస్థితి ఎంత ప్రమాదకరంగా వుందో చెబుతూ, శ్రీ నెహ్రూ యిలా అన్నారు:

"గత మూడు నాలుగు సంవత్సరాల్లో పాకిస్తాన్ ప్రభుత్వం చాలాసార్లు మార్పుచెందింది. ఏ ప్రభుత్వం ఎన్నాళ్ళు అధికారంలో ఉంటుందో చెప్పలేం. అందుచేత మనం చాల అప్రమత్తతతో ఉండాలి. భారతదేశం యుద్ధంలో యిరుక్కోకుండా జాగ్రత్తపడాలి. పాకిస్తాన్ ఉద్దేశపూర్వకంగా, ఒక పథకం ప్రకారం మనమీద యుద్ధం ప్రకటిస్తుందని నేను చెప్పను. కాని ఏ నిమిషంలో ఏమిజరిగినా జరగవచ్చునని మాత్రం చెప్పదలచుకున్నాను."

జనవాక్య సేకరణద్వారా కాశ్మీర్ సమస్యను పరిష్కరించాలంటూ పాకిస్తాన్ పాలకులు చేస్తున్న ప్రకటనలను ప్రస్తావించి, అప్పటికీ యిప్పటికీ పరిస్థితులు పూర్తిగా మారిపోయాయని శ్రీ నెహ్రూ స్పష్టంచేశారు. ఆయనిలా చెప్పారు :

"ఈ మధ్య అనేక కొత్త సంఘటనలు జరిగాయి. అన్నిటికన్న ముఖ్యమైనది పాక్-అమెరికా సైనికసంధి. దానివల్ల కాశ్మీర్‌సమస్య యొక్క స్వరూపం పూర్తిగా మారిపోయింది. పాకిస్తాన్‌కి అమెరికాచేస్తున్న సహాయంవల్ల ఇండియాపై పాకిస్తాన్ దాడిచేయుగలశక్తి పెరుగుతుంది. ఒకవేళ పాకిస్తాన్ సేనలు కాశ్మీర్ భూభాగాన్ని విడిచిపెట్టి సరిహద్దుకు 20 లేక 30 మైళ్ల దూరంలో స్థావర మేర్పచుకున్నప్పటికీ, అక్కడనుంచి దాడిచేయగల సామర్థ్యం అమెరికన్ సహాయంవల్ల లభిస్తుంది. అందుచేత మనం కాశ్మీర్ సమస్యను కొత్త పద్ధతిలో పరిష్కరించడానికి పూనుకోవాలి. పాకిస్తాన్ అమెరికానుంచి సహాయం పొందుతూండడంవల్ల, ఆగ్నేయాసియా - బాగ్దాద్ సైనిక కూటముల్లో అది చేరడంవల్ల జన వాక్యసేకరణ అవసరమన్న ప్రతిపాదనకు పునాదులులేకుండా పోయాయి."

విదేశీ ప్రభుత్వాలు నిర్మించే యుద్ధ కూటములలో చేరడంవల్ల ఏ దేశమూ అభివృద్ధి చెందదనీ, కాని పాకిస్తాన్ నాయకులు అంతకంతకు అధికంగా అట్టి విదేశీ సహాయ మీద ఆధారపడుతున్నారనీ, దీనివల్ల పాకిస్తాన్‌కే నష్టమనీ ప్రధాని నెహ్రూ తన ఢిల్లీ ఉపన్యాసంలో హెచ్చరించారు.

కాశ్మీర్‌లో యిటీవల జరిగిన పరిణామాలనుబట్టికూడా, పరిస్థితి పూర్తిగా మారిపోయిందని తెలుసుకోవచ్చు. కాశ్మీర్‌లో యీ రోజున వయోజనులందరిచే ఎన్నుకోబడ్డ శాసనసభ (ఇదే రాజ్యాంగ నిర్ణయ సభకూడా), ప్రజల విశ్వాసాన్ని చూరగొన్న మంత్రివర్గం అధికారంలో ఉన్నాయి. ఇండియాతో విలీనాన్ని రాజ్యాంగసభ ధృవపరచింది. భూ సంస్కరణలవంటి సంస్కరణలు కొంతవరకు ప్రజల పరిస్థితిని మెరుగుపరిచాయి. కాశ్మీర్ ప్రజలు పునర్నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులై వున్నారు. పరిస్థితులిలా ఉన్నప్పుడు, జనవాక్యసేకరణకు పూనుకుంటే అల్లకల్లోలం, అరాచకం వ్యాపించకమానవు. పాకిస్తాన్ నాయకులు ముస్లిం ప్రజల్లోను, ప్రజా పరిషత్తు నాయకులు హిందువుల్లోను ఆవేశాలు కలిగించి, ఉద్రిక్తను రెచ్చగొడతారనడంలో ఎట్టి సందేహంలేదు. దేశ విభజనకు ముందు, తర్వాత జరిగిన హత్యాకాండవంటిదే కాశ్మీర్‌లో జరిగినప్పటికీ ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

అంతేగాక, పాకిస్తాన్ ప్రభుత్వం తన సేనలను వెనక్కు తరలించకుండా, దురాక్రమణ జరిపిన ప్రాంతాన్ని విడిచిపెట్టకుండా జనవాక్య సేకరణకు అంగీకరించమనటం ప్రజాసామ్యపద్ధతి ఎలా కాగలదు ? అలాంటప్పుడు, పాకిస్తాన్ ఆక్రమించుకున్న ప్రాంతం పాకిస్తాన్‌క్రింద, మిగతాప్రాంతం ఇండియాక్రింద

ఉంటూ, ఒకరిజోలికి ఒకరు వెళ్ళకుండా నిర్యుద్ధ ఒడంబడిక చేసుకోవటమే ఉత్తమ మార్గంకాదా ?

ఇటీవల కొరియాలోను, ఇండో‌చైనాలోను యుద్ధవిరమణ ఒడంబడికలు యిట్టి ప్రాతిపదికపైనే జరిగాయి. వాటివల్ల ఆసియాలో యుద్ధప్రమాదం కొంత తొలగింది. కాని ఇప్పుడు పాకిస్తాన్ పాలకవర్గం అమెరికా సహాయంతో తన సాయుధబలాల సంఖ్యను పెంచుకొంటూ, మాటిమాటికీ సరిహద్దు ఘర్షణలను రెచ్చగొడుతూ, యుద్ధ నినాదాలతో ఉద్రిక్తతను పెంచుతూంటే, కొరియా - ఇండోచైనాలలోవలె కాశ్మీర్‌లోకూడా యుద్ధవిరమణరేఖను ఆధారంగా చేసుకొని ఉభయ ప్రభుత్వాలూ నిర్యుద్ధ ఒడంబడిక చేసుకోడం ఎంతేని అవసరం. ఇలా చేస్తే ఆసియాలో ప్రశాంత వాతావరణం ఏర్పడుతుంది.

కాని పాకిస్తాన్ నాయకులు ఈ సూచనను నిరాకరిస్తున్నారు. ముస్లింలీగ్ పార్టీ తన ముసాయిదా ప్రణాళికలో, భారతదేశంపై "పవిత్రయుద్ధం" ప్రకటించాలని నినాదమిచ్చింది. కాశ్మీర్‌నే కాక, కథియవాడ్‌లోని జునాగఢ్ మొదలైన సంస్థానాలనుకూడా ఆక్రమించుకోవాలని ప్రచారం ప్రారంభించింది. ఇందుకు వాలంటీర్లను కూడా సమీకరించుతున్నట్లు వార్తలు వస్తున్నాయి.

ఈ నినాదాలను, సరిహద్దు ఘర్షణలను చూస్తుంటే, సామ్రాజ్యవాదులు ఇజ్రాయిల్-అరబ్బుదేశాల విషయంలో అనుసరిస్తున్న విధానాన్నే పాకిస్తాన్‌లో కూడ అనుసరించదలచుకున్నట్లు అర్థమవుతుంది. ఇజ్రాయిల్‌కి అమెరికా విస్తారంగా తన ఆయుధాలను సప్లయిచేస్తూ, ఈజిప్ట్ - సిరియా మొదలైన దేశాలతో సరిహద్దు ఘర్షణలను రెచ్చగొడుతూంది. ఈవిధంగా మధ్యప్రాచ్యంలో ఉద్రిక్త వాతావరణాన్ని నిలబెట్ట చూస్తోంది. పాకిస్తాన్ - భారతదేశాల మధ్యకూడా ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ఇట్టి విధానాన్నే అవలంబిస్తున్నారు.

ఈ పరిస్థితి ఎంతో ప్రమాదకరమైనదని వివరిస్తూ, ఇటీవల పాలఘాట్‌లో జరిగిన అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ మహాసభ తన రాజకీయ తీర్మానంలో యిలా తెలియజేసింది :

"పాక్ - అమెరికా సైనిక ఒడంబడిక, ఈ ప్రాంతంలోని సైన్యాల బలా బలాలను మార్చేందుకు అమెరికా బాహాటంగా తలపెట్టిన ఒక ప్రయత్నం. పాకిస్తాన్‌ని భారతదేశానికి వ్యతిరేకంగా తిప్పి, ఉభయదేశాలమధ్య ఉద్రిక్తత కలిగించడానికి చేసిన ప్రయత్నమిది; ఇది ఆసియావాసుల్ని ఆసియావాసులపై ఉసిగొల్పుతుంది. భారత స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు తలపెట్టిన కుట్రల పర్యవసానమే ఇటీవల జరిగిన సరిహద్దుఘర్షణలు. ఈ విషయమై భారత ప్రజలందరికీ కనువిప్పు కావాలి. ఈ విషమసంఘటనలను భారతప్రజలు విస్మరించరాదు. అందరూ ఐక్యమై ఈ ప్రమాదాన్నెదుర్కోవాలి.

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-2.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A104B165 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 94 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B,32,34 |
| లేని పేజీలు | 1-to ii, |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |